ఐక్య సంఘటన

దాన్ని మనం మళ్ళీ నిలబెట్టుతామని ఎవరంటారు!

మావో వారసత్వానికి జరిగిన యుద్ధంలో మరణించిన మావోయిజం ఇక్కడే సమాధి చేయబడింది

ఈమె ముఖం చూడకుండానే నువ్వు అంగీకరించాలి

హువా

చైనా రాడికల్స్

OOMMEN


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]
శుక్రవారం : 12-11-'76
నలనామ సం. కార్తీక బ. పంచమి
సంపుటము 70 : సంచిక : 11
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక



# మ న లో మా ట

పోయిన వారంతో దీపావళి కథల పోటీలోమేముఎన్నికచేసి. ఒక్కొక్క దానికి రూ600చొప్పున బహుమతులు యిచ్చి;వేసిన ఐదుకథల ప్రచురణపూర్తి అయింది. ఇప్పుడు యీ ఐదు కథల లోను పాఠకులు ఉత్తమ కథను నిర్ణయించవలసి వున్నది. ఇదే సంచికలో యిస్తున్న బ్యాలట్ పత్రం మీద మీకు నచ్చిన ఒకేఒక్క కథపేరు వ్రాసి, మీ పేరు పూర్తి చిరునామాతో పత్రాన్ని నింపి నవంబర్ 20, 1976 లోగా మా కార్యాలయానికి అందేలాగు పంపండి.

బ్యాలట్‌లో పాల్గొన్నవారిలో ఎక్కువ మందికి నచ్చిన కథకి రూ. 600 లు అదనపు ప్రథమ బహుమతి అంద జేస్తాము.

అంటే దీపావళి కథల పోటీలో ఉత్తమంగా ఎన్నుకోబడిన కథకి మొత్తం రూ. 1200 లు బహుమతిగా ముడుతుందన్నమాట.

ఇక పాఠకుల ఓట్లుపడ్డ వరసలో ద్వితీయ స్థానం చూరగొన్న కథకి రూ. 500 లు, తృతీయ స్థానం చూరగొన్న కథకి రూ. 400 లు అదనపు బహుమతులు అందజేస్తాము. తతిమా రెండు కథలకు ఒక్కొక్క దానికి రూ. 250 ల చొప్పున ప్రత్యేక బహుమతులు యిస్తాము.

ఈసారి బ్యాలట్ నిర్వహణలో ప్రవేశ బెట్టిన యీ మార్పు మా పాఠకులకి నచ్చుతుందనే అనుకుంటున్నాము.

## వ్యాసరచన పోటీ

అంతేగాక బ్యాలట్‌లో పాల్గొంటున్న పాఠకులను కూడా ప్రోత్సహించే నిమిత్తం చిన్న వ్యాసరచనపోటీ నిర్వహిస్తున్నాము.

దీపావళి కథలలో మీకు నచ్చిన కథని బ్యాలట్ పత్రంలో నింపి- దాంతో పాటే మొత్తం దీపావళి కథలు ఐదింటి పైనా చిన్న అభిప్రాయాన్ని కూడా వ్రాసి పంపండి.

ఈవిధంగా మాకు ది20-11-76 లోగా అందిన వ్యాసాలలో ఉత్తమమైన వ్యాసానికి రూ. 250 లు బహుమతిగా యిస్తాము. ద్వితీయ బహుమతిగా రూ. 150 లు, తృతీయ బహుమతిగా రూ. 100 లు మరి రెండు వ్యాసాలకు యిస్తాము. వ్యాసం నిడివి మాత్రం 800 అక్షరాలకు ఎట్టి పరిస్థితులలోను మించకూడదు.

వ్యాసంతోపాటు సక్రమంగా నింపిన బ్యాలట్ పత్రం వుండితీరాలి.

వ్యాసం వ్రాసి పంపే అభిలాష లేని వారు బ్యాలట్ పత్రం ఒక్కదాన్నీ నింపి పంపవచ్చును.

వ్యాసాలు, బ్యాలట్ పత్రాలు పంపేటప్పుడు మీ పూర్తి చిరునామా లోపల వ్రాయడం- కవరుమీద "దీపావళి కథల బ్యాలట్" సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520 003 అన్న చిరునామా స్పష్టంగా వ్రాయడం అవసరం.

పాఠకుల సౌకర్యార్థం దీపావళి పోటీలో ఎన్నికైన గత రెండు సంచికలలో వెలువడిన కథల పేర్లు యిక్కడ యిస్తున్నాము.

★ ఇంకో నరితకథ ★ గొడుగు
★ ఫోటో ★ సముద్రం
★ హేడ్ వేంకటస్వామి

వీటిలో ఒక్క కథనే ఎన్నుకోండి- అభిప్రాయం మాత్రం ఐదింటిమీద వ్రాయండి.

ఈ బ్యాలట్‌లోను-వ్యాస రచన పోటీలోను విరివిగా మా పాఠకులు పాల్గొంటారని ఆశిస్తున్నాము.

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**బ్యాలట్ పత్రం** ముగింపు తేదీ: **20-11-'76**

**నాకు నచ్చిన "దీపావళి" పోటీకథ**

"..........................................................."

పంపినవారి పేరు :

చిరునామా :

వ్యాసం వుంది / లేదు



---

### ఉత్తరాలు

అన్ని శీర్షికలూ ...

ఈ నాటి (22.10.76) పత్రిక ముఖచిత్రం 'అందంగా' ఆకర్షణీయంగా ఉంది.

కథలు మూడూ ముత్యాల్లా ఉన్నాయి. 'నేను రచయితను కాను''కథ పాఠకుల్ని ఒకనిమిషం ఆలోచింప జేసేదిగా ఉంది. 'కకుభ'గారి 'భ్రమ' నాకు నచ్చలేదు.

వఫీజుద్దీన్ గారి 'మన సినిమాల్లో తెనుగు భాష' వ్యాసంలో నేటి కవులను పేర్కొంటూ 'దాశరథి' గార్ని మరచి పోయారు.

రామాచంద్రమౌళిగారి 'మజిలీ' మమ్మల్ని ఆశక్తిగా చదివిస్తూంది. రెండు భాగాలను మించింది కనుక జరిగిన కథను వేస్తే బాగుంటుంది.

చాలా రోజులతరువాత మళ్లీ పత్రికఅన్ని శీర్షికలతోసహా మాకానందాన్నిచ్చిందని గర్వంగా చెప్పుకునేటట్లు చేసింది. ఈ నాటి పత్రిక—

కె. సూర్యనారాయణ (రాయగడ– ఒరిస్సా)

(50వ పేజీ చూడండి)

*ఎదురింటి గడియారం ఏడుగంటలు కొట్టింది ముసురుకుంటున్న చీకట్లలో బావిదగ్గర అప్పుడే ఆఫీసు నుండి వచ్చి చల్లని నీటితో ముఖం కడుకుంటున్న నీరజతో గిరిజ అంది.*

"జయం అవుతుందక్కా" అని.

"ఏమిటే" అంది నీరజ తువ్వాలందుకుంటూ.

'ఈసారైనా ఈ సంబంధం మా అక్కకు స్థిరపరచు దేవుడా?' అని నేను మొక్కుకుంటూవుంటే గడియారం గంటలు కొట్టింది. అందుకే నీకీ సంబంధం కుదురుతుందని అంటున్నాను" అంది గిరిజ.

"నా కేమీ అర్థం కావటంలేదు. ఏ సంబంధం" బొడ్లో దోపుకున్న చీర కుచ్చిళ్లను దింపుకుంటూ అడిగింది నీరజ.

"ఏవమ్మా! అంత ఆత్రుత? అమ్మ చెపుతుందిలే. నాకేం తెలియదు" అంది గిరిజ.

"ఆత్రుతా లేదు, ఆనందమూ లేదు గిరిజా. ప్రసంగాన్ని నీవే లేవ్వాను. చెప్తే చెప్పు లేకపోతే లేదు" అంది నీరజ యింటివైపు కదలబోతూ.

"అంతేగాని బతిమిలాడవుగా!" ముందుకు కదులుతున్న నీరజ చెయ్యి పట్టుకుని ఆమె ముఖంలోకి చూస్తూ అంది గిరిజ.

"ఏమంత ఆనందకరమైన విషయమని బ్రతిమలాడి చెప్పించుకోవాలె గిరిజా! వస్తాడు. వస్తాడని మనం ఎదురుచూస్తాం. ఆ పెళ్ళికొడుకు రానె వస్తాడు. ఎంతో ఆట్టహాసం చేస్తాం. చూస్తాడు. అయిదు వేలకు తగ్గకండ కట్నం అడుగుతాడు. మన మెలాగూ యివ్వలేము. నచ్చలేదని వెళ్లిపోతాడు. ఇంతేగా జరుగుతుంది. ఇంతకన్న ఇంకేం జరుగుతుంది? క్రొత్త కథేమి కాదుగా" జామచెట్టు క్రింద వున్న నులక మంచంమీద నెమ్మదిగా కూలబడుతూ.

"ఈ కథ క్రొత్తదే అక్కా! సరిక్రొత్త కథ."

"ఏమిటే ఆ కొత్తదనం?"

"పెళ్ళికొడుకు ఈసారి నిన్ను వెతుక్కుంటూ వచ్చాడక్కా!"

"ఎగతాళి చేయటానికి నేను తప్ప నీకెవరూ దొరకలేదా గిరిజా!"

"తాళి కట్టించుకునే వేళయిందంటె ఎగతాళి అంటావేవమ్మా! ఇంతకీ అతనెవరో తెలుసా? మనఊరే. మనవీధే"

"మన వీధిలో పెళ్లికొడుకెవరబ్బా!"

"చంద్రదంగారక్కా!"

"ఏ చంద్రదంగారు గిరిజా!"

"మన వీధి చివర డాబా యింట్లో ఉండటంలేదూ! ఆయనే."

"అతనా?"

"ఏసమ్మా అంత తేలిగ్గా అనేశావు?"

"అతని పెళ్లాంపోయి సంవత్సరమే కదా



# రాజీనామా

ఊర్వశి

అయింది. అతనికొక కూతురుకూడా కదా! అతనప్పుడే పెళ్లికి సిద్ధపడ్డాడా?"

"సిద్ధపడకపోతే ఆ పసికందు నెవరు చూస్తారక్కా! అతనికి తల్లి తండ్రీ లేరు. అన్నలు. అక్కలు, వదినలు ఎంతమందిఉన్నా ఎవరుమాత్రం పసికందు నెంతకాలం సాకుతారు? మరి పెళ్లి చేసుకోకపోతే. ఎలా?' అడిగింది గిరిజ.

"పాపం అతనిమీద ఎంత జాలే నీకు?"

"నీకుమాత్రం జాలిలేదా? నిన్ను ఈ పెళ్ళికి ఒప్పించమని నీవు ఆఫీసుకు వెళ్ళిపోయిన తరువాత అతని తరపునవాళ్ళు ఎంతమంది వచ్చారో తెలుసునా? ఇద్దరక్కలు, ఇద్దరు వదినలు–ఇంకా మావయ్యలో ఎవరో చాలమంది అమ్మకు ఎంతెంతో చెప్పివెళ్ళారు. నీవతనికి నచ్చావట. కట్నం అక్కరలేదట."

"కట్నం అక్కరలేదన్నాడనేగా మీ కందరికీ ఈ సంబంధం నచ్చింది?"

"కట్నంకోరితే మంచిసంబంధం అయ్యుండేదా? కట్నం అడిగితేమాత్రం అతనికి భార్య దొరకదా? ఇంతకూ అతనికేమితక్కువ? నిండా ముప్పయిఏళ్ళుకూడలేవు. అనాకారి కాడు. ఉద్యోగం లేనివాడుకాడు. మరి ఎందుకమ్మా! అంత నిర్లిప్తత?" అడిగింది గిరిజ.

సమాధానం రాయకుండ మంచంమీద నుండి లేచి వెళ్ళిపో ఉద్యుక్తురాలయింది నీరజ

"ఏవక్కా మాట్లాడవు ? నీకీ పెళ్ళి యిష్టంలేదా ?" చెయ్యిపట్టుకుని అడిగింది గిరిజ

"నన్నేమీ అడగకు గిరిజా ! నన్ను వెళ్ళనియ్యి" అంటూ యింటిలోకి సాగిపోయింది నీరజ, గిరిజ నెమ్మదిగా ఆమెననుసరించింది.

కాఫీ అందిస్తున్న తల్లి ఏదో చెప్పబోతుండగా నీరజనేమీ మాటాడించవద్దని గిరిజ తల్లికి సైగచేసింది. కాఫీ తాగేసి తల ఎత్తకుండ జామిచెట్టు కిందికి వెళ్ళిపోయింది నీరజ.

"ఏం జరిగింది ?" నెమ్మదిగా అడిగింది శాంతమ్మ.

"ఏంలేదమ్మా ఇప్పుడే ఆఫీసునుండి వచ్చింది కదా! అలసిపోయిఉంది అంతే" అంటూ వెళ్ళిపోయింది గిరిజ

భోజనం దగ్గరకూడ ఎవరితో మాటాడక ఎవరూ మాటాడటానికి అవకాశం ఈయక భోజనంచేసి వెళ్ళిపోయింది నీరజ.

వంటింటిలో పని ముగించుకుని నెమ్మదిగా గదిలోకి వెళ్ళింది గిరిజ. కిటికీదగ్గర కూర్చుని చీకటిలోకి చూస్తున్న నీరజ ప్రక్కనే చేరి "ఏమాలోచిస్తున్నావక్కా !" అడిగింది గిరిజ తుళ్ళిపడింది నీరజ.

"రెండో పెళ్ళివాడనా ?" అడిగింది గిరిజ

"కాదు గిరిజా !" సమాధానమిచ్చింది నీరజ.

"అదికాక మరేమిటి ? ఇందాకటినుంచి విర్లిప్తంగా ఉన్నావు ?"

"ఏం లేదు గిరిజా ! నన్నిలా ఉండనియ్యి"

"అక్కా ! నీకీపెళ్ళి యిష్టంలేదుకదూ!" గిరిజ వదలిపెట్టలేదు.

"ఈ పెళ్ళే అని ఏముంది గిరిజా ! నాకు పెళ్ళంటేనే యిష్టంలేదు"

"ఎందుకిలా మాటాడుతున్నావు ? నీకేం వయసు దాటిపోయిందని ?"

"అనేమికాదమ్మా గిరిజా ! నేను పెళ్ళి చేసికుని వెళ్ళిపోతే ఈయిల్లు ఎలా నడుస్తుంది ? తమ్ముడి చదువు వచ్చేయేటికి గాని పూర్తికాదు. అప్పటికీ ఉద్యోగం వస్తుందన్న నమ్మకమేమిటి ? అన్నయ్య గాడ్యుయేటయి రెండుసంవత్సరాలయినా ఉద్యోగం లేదుగా నీచదువు పార్వతి చదువు ఇంకా మొదటిలోనే ఉన్నాయి. నాన్న పెన్షన్, బట్టలకొట్టు వాళ్ళిచ్చేది కలిపితే నూరు ముప్ఫైయ్యేకదా. మరి సంసారం ఎలానడుస్తుంది?"

"ఇంటి పరిస్థితి చూచేనా నీవు పెళ్ళికి విముఖంగా ఉన్నావు? ఈ బాధలు ఈ నాటితో తీరవు అక్కా ! నీవు అదృష్టవంతురాలవు కాబట్టి నీకీ సంబంధమైనా వచ్చింది. వచ్చిన అదృష్టాన్ని వదులకోకు అక్కా ! పెళ్ళి చేసికొనివెళ్ళిపో. మాకాపాటి అదృష్టం కూడ ఉండదు."

"బెంగపడకు గిరిజా! నీదారికి నేను అడ్డురాను, మీకు పెళ్ళిళ్ళుచేసే పూచీ నాది."

"మరి నీ పెళ్ళి'

"నేను పెళ్ళిచేసికోను గిరిజా !"

"ఎంతదారుణంగా మాటాడుతున్నావక్కా ! నీవు పెళ్ళిచేసికోకపోతే నేనుమాత్రం చేసికుంటానా ? నీవు పెళ్ళిచేసికొని వెళ్ళిపోతే అన్నయ్య ఏ ఆర్భాటాలకూ పోక ఏచిన్న ఉద్యోగంలోనైనా చేరతాడు. కుటుంబాన్ని పోషించే పద్ధతులు వెతుకుతాడు. నీవీయింట ఉన్నంత కాలం యింతే. అన్నయ్య ఆఫీసరు ఉద్యోగాలనే కలలుకంటూ ఉంటాడు"

"పెళ్ళి విషయమై నన్ను బలవంతం చెయ్యకు గిరిజా !

"పెళ్ళంటే సుముఖంగా ఉండని స్త్రీ ఉండదు అక్కా ! కాని నీవు పెళ్ళివద్దనటం పూర్తి విముఖతగా నే ననుకోను. నీవు తప్పించుకోటానికీ మాటలు అంటున్నావు నీ మనసులో ఏదో ఉంది. నాకు చెప్పవూ."

నీరజ మాటాడలేదు.

"మాటాడవేం అక్కా? నీ మనసులో ఎవరైనా ఉన్నారా?"

"గిరిజా!" పట్టుపడిన దానిలా చూచింది నీరజ.

"ఎవరక్కా! నాతో చెప్పవూ?"

"చెప్తాను గిరిజా! కాని...ఏదీ నీ చెయ్యి ఇలా యియ్యి. నే చెప్పేది ఎవరికీ చెప్పనని మాటియ్యి."

గిరిజ చేతి నిచ్చింది.

"నే చెప్పేది ఎవరితోనూ చెప్పకూడదు. మనసులోనే దాచుకోవాలి మాటేనా?"

"మాటే" అంది గిరిజ నీరజ చేతిని గట్టిగా నొక్కుతూ.

"ప్రకాశరావుగారు నన్ను పెళ్ళి చేసికుంటానని మాటిచ్చారు గిరిజా! అతను నాకు మంచి స్నేహితుడు. నేనూ అతన్ని యిష్టపడ్డాను. మా పెళ్ళి జరిగితీరుతుంది. కాని కుటుంబ పరిస్థితుల వల్ల ఒక సంవత్సరం వరకూ మా పెళ్ళి జరగదు అతని తమ్ముడి చదువు వచ్చే యేటికిగాని పూర్తికాదు. అంతవరకూ వాయిదా వేయక తప్పదు. చందంగారు మంచివారే నాకు తెలుసు. కాని మనసుకాని మనువు అది గిరిజా ఈ పెళ్ళి ఎలాగైనా తప్పించు" గిరిజ చేతిని గట్టిగా నొక్కి అంది.

"ఈమాట నీవు అమ్మతో చెప్పవచ్చుగా"

"చెప్పవచ్చు. కాని ఒకఅభ్యంతరం. అతనిది మన కులం కాదు. అతను మాత్రం నాకు మంచి స్నేహితుడు నన్ను బాగా అర్థం చేసికున్నవాడు...గిరిజా నీకిలా వాడి వాడిగ చెప్తే అర్థం కాదు. వివరంగానే చెప్తాను విను. నేనిప్పటి కప్పుడే ఉద్యోగంచేస్తూ ఆరు సంవత్సరాలు దాటతోంది ఈ ఆరు సంవత్సరాలలో ఎన్ని బాధలు పడ్డానో ఎన్ని అవమానాలు సహించానో మీకు తెలియదు. నేను కూడ మీకెవరికీ చెప్పలేదు. కారణం చెప్పినా ప్రయోజనం లేదు కనుక మీ అందరిదృష్టిలో నేనొక కల్పతరువుని. సంపాదించేయంత్రాన్ని

# రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్ ...

ఇంత మంది రాజకీయ దురంధరుల
ఒక్కసారిగా కనిపించే సరికి
చాటంతయింది ముసలి బిచ్చగాడి మొగం
అరిగిన చెప్పులూ దళసరి కళ్ళద్దాలూ
కర్రావాడూ అర్థనగ్నంగా
అసహ్యంగా ఉన్నాడు
నిటారుగా నిలవలేకపోతూ
అర్థిస్తున్నాడు
"మీ జేబుల్లో కాస్తంత
త్యాగం ఉందేమో
బిచ్చం పెట్టండి బాబులూ !"
'వెళ్ళు వెళ్ళు అదింకా
మాదగ్గ రెక్కడుంది '
ఇప్పుడే రాజఘాట్‌లో
సమర్పించి వచ్చాం, పో !'
బిచ్చగాడు విస్తుపోయి నించున్నాడు
మొహం చెల్లక !
తానిప్పుడెక్కడ్నుంచి వస్తున్నాడు
ఎలా చెప్పగలడు పాపం !

మీ అందరికోసం నేను యంత్రంగానే మారక తప్పలేదు. ఆఫీసుకు నడచి వెళ్లేదాన్ని, నడచి వచ్చేదాన్ని. లంచ్ టైములో టీ నీళ్లకుతప్ప మరెందుకు నేను నోచుకోలేదు. సుమారుగా నా జీతాన్నంతా నాన్న చేతిలో పోశాను. కాని మీలో ఏ ఒక్కరూ కూడ నా కష్టసుఖాలను పరామర్శించలేదు కాని ఎవ్వరైనా కనిపించి లాలింపుగా పలుకరిస్తే అంతా చెప్పుకుని ఏడ్వాలని నా కుండేది ఉద్యోగం చేసి సంపాదించుకునే ఆడది ఎంతో సుఖపడుతుందని మీరంతా అనుకుంటారేమో కానేకాదు. నలుగురు మగ వాళ్ళమధ్యన పనిచేసే ఆడదాన్ని అవహేళన చేయటం, అవమానించటం, అందితే అనుభవించి విడిచిపెట్టటంతప్ప ఈ మగవాళ్ళ కేదీ చేతకాదు అందరూ అలా ఉంటారని కాదు కాని నూటికి తొంభయిమంది అంతే. ఇంటా బయటా సానుభూతి లేనప్పుడు బతికి ఎందుకు? చావాలనిపించేది కాని చస్తే మీరంతా ఏడుస్తారు యిల్లెలా గడుస్తుందని. 'ఏదో చేయరానిపని చేసింది. అందుకే చచ్చింది' అని లోకం నిందను అంటకడుతుంది. డాక్టర్లు శవాన్ని కత్తులతో కోస్తారు ఏతప్పూ చేయకపోయినా నిందను మోసికొని పోవాలికదా అనే భయపడ్డాను. అందుకే చావలేదు. కాని మానసికంగా క్షణక్షణం చచ్చిపోతూవుంటే సుమారు రెండు సంవత్సరాల క్రితం ప్రకాశరావుగారు ట్రాన్స్‌ఫర్‌మీద మా ఆఫీసుకు వచ్చారు చూచిన మొదటి రోజుననే నాకతని మీద సదభిప్రాయం కలిగింది అతను అందరిలా ఒళ్ళు దాచుకునే మనిషికాదు ఇతరులను మెప్పించాలని చూచే రకమూకాదు ఆడవాళ్ళ గురించి తేలికగా మాటాడే శాస్త్రికి గట్టిగా బుద్ధి చెప్పాడు. నన్ను అవమానం చేదామనుకున్న శివయ్య కంటవెంట నీరు తెప్పించాడు అతని రాకతో మా పదిమంది స్టాఫ్‌లోనూ మార్పు వచ్చింది "అందరం ఉద్యోగంకోసం వచ్చిన వారమే అందరికీ కష్టాలు ఇబ్బందులు ఉన్నాయి ఒకరి కష్టాలను మరొకరు సానుభూతితో విని ఆదుకుంటూ పోవటమే మన ధర్మం. అప్పుడు ఎన్ని కష్టాలయినా కష్టాలనిపించవు." అని అందరి మనసులకు హత్తుకునేటట్టు చెప్పాడు అతను ఆఫీసులో పని చేస్తున్నంత కాలము ఎవరూ ఏమీ చేయలేరు అన్న ధైర్యం నాకు కలిగింది ఎప్పుడైనా పని ఎక్కువగా ఉంటే 'నీరజగారూ, మీరింటికి

# రాజీనామా

వెళ్ళండి. చీకటి పడుతోంది. నానీ పేపర్సు టైప్‌చేసి మేనేజరుగారికి ఒప్పచెప్తాలెండి" అని నన్ను యింటికి పంపించేవారు ఇలా నాకే కాదు ఎవరు పనితో సతమతమవుతున్నా తాను చేయగల సహాయాన్ని చేసేవారు. అందుకే అతనంటే అందరికీ యిష్టం. ఒక రోజున నేను అరగంట ఆలస్యంగా ఆఫీసుకెళ్ళాను. ఎప్పుడో తెలుసా! నీవూ అమ్మ ఇంటిలోకి రానప్పుడు ఆ రోజు మీ అందరికీ వండి పెట్టి వెళ్ళేసరికి ఆలస్యమయింది. అలా ఆలస్యంగా వెళ్ళటం అదే మొదటిసారి కాదు. వరసగా మూడోరోజది. ఆరోజు మరీ ఆలస్యమయింది. అందుచేత ఆఫీసర్‌చేత చీవాట్లు తినవలసి వచ్చింది. నాకు కన్నీళ్ళాగలేదు.






ఇవతలికివచ్చి సెలవుచీటిరాసి ఆఫీసర్ గదిలోకి వెళ్ళబోతూంటే ప్రకాశరావుగారు అడ్డుపడి నా చేతిలోనున్న కాగితాన్ని లాక్కుని "మీ సీటుకెళ్ళి మీపని చేసుకోండి" అని చెప్పి తను ఆఫీసర్‌గారి గదిలోకి వెళ్ళిపోయారు. మరి అతను ఏమి చెప్పారో తెలియదు. ఆ రోజు ప్రతిరోజులాగే మామూలుగానే గడిచింది ఆ రోజున ఆఫీసునుండి వచ్చేస్తుంటే ప్రకాశరావుగారు నాతోకూడా వస్తూ.

"మీరిలా ప్రతిరోజు లేటుగా వస్తే ఎలా? కొద్దిగ త్వరగా పనులు ముగించుకుని బయలు దేరాలి. ఇవ్వాళ మొదటిసారైంది కాబట్టి అడ్డుపడ్డాను. మరో రోజున అడ్డురాను" అన్నారు.

"ఇవ్వాళ మా తం అడ్డుపడమని మిమ్మల్నెవరడిగారు?" అన్నాను. అతను నా ముఖం నైపు ఒకసారి చూచి నెమ్మదిగా "ఎందుకో మీకు తెలియదా?" అడిగారు.

"ఎందుకు?" అడిగాను,

"మీరు స్నేహితులు కాబట్టి, మీ అమాయకత్వం, ఎవరినీ ఎదిరించలేని అసహాయతను చూచి అడ్డుపడ్డాను. ఆలస్యమవుతుందన్న రోజునైనా ఆఫీసుకు రిక్షా ఎక్కైనా రావాలి. అలా చేయకపోతే ఇవ్వాళ జరిగినట్టే జరుగుతుంది. మీ ఖర్చుకోసమైన కొద్దిగ పాకెట్‌మనీ మీ పర్సులో ఉంచుకోండి" అని సలహా యిచ్చాడు.

మేము నడుచుకుని మాటాడుకుంటూ వస్తున్నాము. అప్పటికే చీకటి పడింది.

"జీతమంతా ఇంటిలో యిచ్చేయటం కాదు. మీ ఖర్చుకోసం కొంతయినా ఉంచుకోండి మేడమ్" అన్నాడు.

"జీతమంతా యింటికే యిచ్చేస్తానని మీ కెవరు చెప్పారు?" అడిగాను.

"ఒకళ్ళు చెప్తేగాని తెలియని విషయమా?" నా గురించి ఎంతో తెలిసినట్టు అతను అప్పుడిగా మాటాడుతూంటే ఎంతో ఆనందం కలిగింది. అతను మన యింటి గురించి అడుగుతూంటే అతనినుండి ఏదీ దాచాలనిపించలేదు. నేను చెప్పినదంతా అతను విన్నారు. "ఇంటింట ఇదే కథ" అంటూ తన గురించి చెప్పారు. వింటుంటే అంతటి బరువును మోస్తూ ఏ బాధా లేనివాడిలా అతనెలా నవ్వగలుగుతున్నాడా అని ఆశ్చర్యపోయాను.

"మా తమ్ముడి చదువైపోతే చాలు నా బాధ్యతలు చాల తగ్గినట్టే. ఇంక సుమారు రెండు సంవత్సరాల కాలం" అన్నారతను. ఆ నాటినుండి మేము మంచి స్నేహితులమయ్యాము. అతను నాకు అప్తుడు, ఆత్మీయుడు అయినారు. మనసుకు చాలా సన్నిహితంగా వచ్చేశారు. ఒకరోజున ఆయనే అన్నారు. 'మీరు యిష్టపడితే మిమ్మల్ని నేను పెళ్ళి చేసుకుంటాన'ని కాని ఒక సంవత్సరం ఆగవలసి ఉంటుందని చెప్పారు. నే నంగీకరించాను. నా అంగీకారాన్ని తీసుకునే అతను తనకు దగ్గరైన సంబంధాన్ని కూడ కాదన్నారు. ఆ అమ్మాయికి పెళ్ళి అయిపోయింది. ఈ పరిస్థితిలో నా స్వార్థం నేను చూచుకొని

పెళ్ళి చేసికొని అతన్ని కాదనటం న్యాయమా? చెప్పు?'' అడిగింది నీరజ.

''న్యాయాన్యాయాలు చెప్పటానికి నేనె వర్తినక్కా? అమ్మా నాన్నకు తెలియకుండ నీవు ఎవరికో మాట యివ్వటం న్యాయ మంటావా? కులము గోత్రము సరిపడని వివాహానికి నీవు సిద్ధపడటం సబబు అనే అంటావా అక్కా!''

''గిరిజా!''

''అవునక్కా! నేనే అంటున్నాను. నీగురించే నీవాలోచించుకున్నావు గాని మా గురించి నీవేమైనా ఆలోచించేవా? ఆలోచించిన దానవైతే ఇలాంటి నిర్ణయం చేస్తావా? అన్నీ సవ్యంగా ఉంటేనే ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు సమస్యలుగా ఉన్న ఈ కాలంలో నీకేగాని ప్రకాశరావుగారితో పెళ్ళయితే రేపు మా సంగతి ఏమిటి? నీవు తప్పుచేసి సంఘంలో మమ్మల్ని పెళ్ళి చేసికోటానికి సంస్కారులు, సహృదయులు లేరని సంఘాన్ని నిందిస్తే ఏమిటి ప్రయోజనం?''

''గిరిజా నాకు పిచ్చి ఎక్కించకు!''

''పిచ్చిదానవు కాకముందే జాగ్రత్తపడు.''

''గిరిజా! ముందేచెప్పానమ్మా! మీ పెళ్ళిళ్ళు నే చేయిస్తానని. మీ దారులకు నే నడ్డురానని. నా పెళ్ళి అవుతుంది మీ పెళ్ళిళ్ళ తరువాతేలే. అప్పుడు నా వలన మీ కెవ్వరికీ దిక్కుతోచని గతి పట్టదు. నాకోస మతను ఎంతకాలమైనా ఉంటారు.''

''అక్కా! నీ ఆలోచనలు సరిగా సాగటం లేదు నీకేదో పిచ్చిపట్టింది'' అంటూ గిరిజ అక్కడనుండి లేచి వెళ్ళిపోయింది.

నీరజ తలదిమ్మెక్కిపోయింది ఆకాశంలో చుక్కలనే చూస్తూ ప్రకాశరావు గురించి ఆలోచిస్తూంటే శాంతమ్మ నెమ్మదిగా నీరజ ప్రక్కన వచ్చికూర్చుంది. తల్లినిచూచి లేచి కూర్చుంది నీరజ.

''గిరిజ నీకేమీ చెప్పలేదా నీరజా!''అడిగిందామె.

''చెప్పిందమ్మ'' అంది నీరజ తలవంచుకుని.

''మరి నీవే మంటావమ్మా ! రెండోపెళ్ళి అన్నమాట తప్ప మరిలోపమేమిటి ? నీకు అతను తెలుసును. అతనికి నీవు తెలుసును. కానికులం కాదు. మంచిసాంప్రదాయం. అతని వెనుక మంచి వెడ్డా చూచేందుకు అతనివాళ్ళున్నారు. మంచివాడు. నీవు నామ్ముందుంటావు. నీవు ఉద్యోగంచేసినా అతనుకాదనడు. అతనికీ బరువుబాధ్యతలులేవు. నీవు ఈ కుటుంబాన్ని ఆదుకోవటం అవుతుంది. నీపెళ్ళి అయినట్లు ఉంటుంది. పెళ్ళికాని పిల్లను ఎంతకాలం గుండెలమీద కుంపటిలా ఉంచుకోమంటావు నీరజా ! నీపెళ్ళయితే మీఅన్నకేదైనా ఉద్యోగం దొరుకుతుంది. ''ఊ అను నీరజా !'' అందామె.

''నన్ను ఆలోచించుకోనియ్యమ్మా'' అంది నీరజ.

''ఇందులో ఆలోచించుకోటానికేముంది నీరజా ! ఒకమాట స్పష్టంగా చెప్తున్నాను. చంద్రంగారికి మేము పైసా కట్నంకూడ ఈయనవసరంలేదు. ఇది తప్పితే కట్నాలు పోసి నీకు పెళ్ళిచేయటం మా తలకు మించిన పని. నీకు పెళ్ళి కాకపోతే గిరిజ, పార్వతి అలాగే ఉండక తప్పదు. లేనిపోని భ్రాంతికి పోయి వచ్చిన అవకాశాన్ని కాలదన్నుకోకు

సీరజా. బాగా ఆలోచించు" అని చెప్పి వెళ్ళి పోయిందామె.

చంద్రంగార్ని పెళ్ళిచేసికుని అతనికి సేవలు చేస్తూ, పిల్లల్నికంటూ, పుట్టింటికోసం ఉద్యోగంచేస్తూ జీవితాన్ని గడపవలసి ఉన్నదన్న సత్యం స్పష్టపడగానే "భగవాన్! రెండు

## రా జీ నా మా

ప్రక్కలా నే నరిగిపోలేను. నాకీ పెళ్ళివద్దు. ఈపెళ్ళి నెలాగైనా తప్పించు" అని దేవుడికి మొక్కుకుంది నీరజ.

* * *



నీరజ యాంత్రికంగా టైప్ చేస్తూనే ఉంది. కాని మనసు మాత్రం గడియారంమీదే ఉంది. బరువుగా "లంచ్ బ్రేక్" వచ్చింది. యధావిధిగా పలకరించవచ్చాడు ప్రకాశరావు. "సాయంత్రం మీతో ఒకముఖ్యమైనవిషయం మాటాడాలి. నాకోసం ఆగుతారుకదూ" అడిగింది నీరజ.

"అలాగే. ఇంతకీ ఏమిటా ముఖ్యమైన విషయం?" అడిగాడు ఆత్రుత నాపుకోలేక

"చెప్తాను" అంది నీరజ. ప్రకాశరావు ఊహాగానాలు చేస్తూ వెళ్ళిపోయాడు. అప్పటినుండి ఆఫీసు టైమయ్యేంతవరకు అసహనంగా తనవైపు ప్రకాశరావు చూడటం నీరజ గమనిస్తూనే ఉంది.

ఆఫీసునుండి వచ్చేస్తూంటే నెమ్మదిగా ఫాలో అయ్యాడు ప్రకాశరావు.

"ఎక్కడైనా కూర్చుందాం" అంది నీరజ. ఇద్దరూ వెళ్ళి హోటల్లో ఒక మూల కూర్చున్నారు. నీరజ తానేమీ తీసికోనంది. ప్రకాశరావు రెండుకాఫీకి ఆర్డరిచ్చాడు. కాఫీ తీసుకుంటూ తనకేర్పడిన పరిస్థితిని నెమ్మదిగా చెప్పింది నీరజ" ఈ పెళ్ళిని ఎలా తప్పించుకోవాలో నాకు తెలియటంలేదు." అంటూ ఆగిపోయింది.

ప్రకాశరావు దీర్ఘంగా ఆలోచించాడు "మనసంగతి మీయింటిలో తెలియదా?" అడిగాడు. 'తెలియదు' తలవంచుకునే సమాధానమిచ్చింది నీరజ.

"చెప్పేసేయి. ఒక సంవత్సరం తరువాత మనపెళ్ళికూడ అవుతుందని చెప్పేయి."

"చెప్తాను. గాని ఒప్పించలేను. ఇంట్లో అంగీకరిస్తారన్న నమ్మకంలేదు"

"అయితే నేనేవచ్చి చెప్తాను." అన్నాడు దృఢంగా.

"మీరా!" అంది తలెత్తి నీరజ

"అవును. ఎప్పుడైనా చెప్పవలసినదేగా నిన్ను నేను రహస్యంగా పెళ్ళి చేసికోబోవటం లేదుగా."

"మనపెళ్ళికి అంగీకరించకపోతే......"

"ఇక నీవు నాకోసం వేచి ఉండనవసరం లేదు. చంద్రంగార్ని పెళ్ళిచేసికో"

నీరజ కొద్దిసేపు అతని కళ్ళలోకే చూచింది.

"నీ చూపు నాకర్థమైంది. ఇరువైపులా ఏ పక్షంవారు పెళ్ళికి యిష్టపడకపోయినట్లయినా ఆపెళ్ళి జరిగినా సుఖంలేదు. నీవు

మాయింటిలో అందరికి సమ్మతమైనావు. నేనుకూడ మీవైపువారిచేత యిష్టపడినపుడే మనది ఆనందకరమైన జీవితం. కాని నాడు అది శాపగ్రస్తం'' అన్నాడు ప్రకాశరావు.

నీరజ కళ్లలో కన్నీరుబికింది.

"అధైర్యపడకు నీరజా! అందరినీ ఒప్పించే పూచీ నాది. ఒప్పించగలననే ధైర్యముంది. మరి ఎందుకా కన్నీరు ?'' అన్నాడు.

నీరజ నెమ్మదిగా కన్నీరు తుడుచుకుంటూ "అర్థమైంది. మనపెళ్ళి మరి జరగదు'' అంది.

"జరుగుతుంది నీరజా! నేను ఒప్పిస్తాగా''

"అది జరగనిపని. మనపెళ్ళి మరి జరగదు. మీరు మాయింటికి రాకండి. మీరు అవమానపడటం నేను సహించలేను''

"నీరజా!''

"అవును. మీకుదయవుంటే ఎప్పుడైన నన్ను తలుచుకోండి. పదండి వెళ్దాం'' అంది నీరజ

నీరజ మనోగతాన్ని ఊహిస్తూ నెమ్మదిగా లేచాడు ప్రకాశరావు.

తన ఇంటికి రావద్దని నీరజ హెచ్చరించినప్పటికీ మర్నాడు ఉదయం ప్రకాశరావు నీరజ ఇంటికి వెళ్ళాడు. నీరజను తాను యిష్టపడి పెళ్ళిచేసికోదలచిన విషయాన్ని తెలియజేశాడు ఆమె తండ్రిలో. అతను నాదగ్గర కేమాత్రం అవకాశాన్నివ్వక "కులం తక్కువ వివాహాలు మావంశంలో లేవు. ప్రేమ వివాహాల మీద నాకు నమ్మకంలేదు. అయినా నీరజ పెళ్ళి నిశ్చయమైంది. ఇక వెనుకకుపోవటం జరగదు.'' అన్నాడు నీరజతండ్రి.

ప్రకాశరావు వాదించటానికి ప్రయత్నించాడు. కాని ఫలితం లేకపోయింది. ప్రకాశరావు ఖిన్నుడై వచ్చేశాడు.

నీరజ పెళ్ళి పదిహేను దినాలకే అయిపోయింది.

* * *

'ఈనెల పూర్తయిపోగానే ఉద్యోగానికిరాజీనామా చేదామనుకుంటున్నాను' అని చెప్పేసింది నీరజ, చంద్రశేఖర్‌తో మొదటి రోజు రాత్రి. అంతవరకు కుటుంబం కోసం శ్రమపడి ఆదుకోవాలనుకున్న నీరజ, ప్రకాశరావుతో తనవివాహం జరగకపోవటంతో మానసికంగా దెబ్బతిన్నది. పెళ్ళి తప్పించిన తనవారికోసం తానెందుకు శ్రమపడాలనే తిరుగుబాటుతనం ఆమెలో పెల్లుబికింది.




అందుచేతనే ఆమె ఈ నిర్ణయం చేసికుంది.

"నీవు ఉద్యోగం మానేస్తే మీవాళ్ళేమనుకుంటారు. నేను మాన్పించాననుకోరు ? మీ అన్న సూర్యం ఉద్యోగం దొరికేంతవరకు నీవు ఉద్యోగం చేస్తావని మాటయిచ్చాను.'' అన్నాడు చంద్రశేఖరం.

"పెళ్ళి చేసికున్న తరువాతకూడా నేను ఉద్యోగం చేయవలసి వస్తుందని నాకు ఎవరూ చెప్పలేదు.''

"కాని ఆ షరతుమీదే నిన్ను నాకివ్వటానికి మీ వాళ్లు ఒప్పుకున్నారు. నేను అంగీకరించక తప్పలేదు.''

"మీరెందు కొప్పుకున్నారు? నేను కాకపోతే మీకెవరూ దొరకరా ?''

"నేనెవర్ని చేసికున్నా ఈ ప్రశ్న అడగక తప్పరు. ఎవరికైనా నేనుమాత్రం ఏమని చెప్తాను ? ఎవరో అన్నారు 'ఆ అమ్మాయి నెందుకు పెళ్ళిచేసికోకూడదూ ? అని. అవును ఎందుకు చేసికోకూడదూ ?' అని నేననుకున్నాను. రాయబారాలు నడిచాయి. పెళ్ళిఅయింది'' అన్నాడు.

నీరజ మాటాడకుండ మిన్నకుండిపోయింది.

"మాటాడవేం? మరేమి ప్రశ్నలు లేవా?''

"ఇప్పటికింతే'' అంది నెమ్మదిగా.

"రెండో పెళ్ళివాడు భర్తయినాడని ఆలోచిస్తున్నావుకదూ ?''

"ఛ! లేదు. నేనెప్పుడూ అలా అనుకోలేదు.''

"నీరజా! రాధపోయిన తరువాత పెళ్ళి చేసికోకూడదనే అనుకున్నాను. నిర్మలను ఎవరికైనా పెంచుకోటానికి యిచ్చి ఒంటరిగానే జీవితం గడిపేద్దామనుకున్నాను. కాని నేను ఒంటరిగా ఉండటం నాతరఫు ఎవ్వరూ ఇష్టపడలేదు. అందరి బలవంతమే ఈ పెళ్ళికి దారితీసింది. కొందరు స్నేహితులు "ఒక స్త్రీ జీవితాన్ని ఎందుకు ఉద్ధరించకూడదూ ?'' అని హితబోధచేసారు. కాని నిన్ను పెళ్ళిచేసికోటంలో నేను ఏదో గొప్పవిషయాన్ని చేశానని అంగీకరించను. నేను మీనాన్నగారిదగ్గర కట్నం తీసికోలేదు. అలానే రాధ తండ్రిగారి దగ్గరకూడా తీసికోలేదు. మీఅన్నకు ఉద్యోగం దొరకగానే రేపు ఉద్యోగం మానేయవచ్చు. నిన్ను సుఖపెట్టటమే నా ధర్మం.''

అతను మాటాడుతూంటే నీరజకు మాటలురాలేదు.

"నేను ఈపెళ్ళి చేసికోవటం తప్పనిసరే నీరజా! నేను బరువైన ఆలోచనను భరించలేను. తీవ్రంగా ఆలోచించిననాడు గుండెలో విపరీతమైన పోటువస్తుంది. చచ్చిపోతానేమో అని భయమేస్తుంది. కాని విశ్రాంతి తీసికుంటే తగ్గిపోతుంది. రాధ పోయినతరువాత ఈగుండెనొప్పి మరీ ఎక్కువైంది. రాధనుండి ఆలోచనలు మరలించుకోవటంకోసం, నీలో రాధను చూడటంకోసం నేనీపెళ్ళిచేసికున్నాను ఇక నాకేభయంలేదు నీరజ నాదగ్గర ఉన్నంతకాలం అవునా ?'' అన్నాడు ఆమె చేతిని తనచేతిలోకి తీసికుంటూ.

"అవును మీకేం భయం లేదు!'' అంది నీరజ.

* * *

ట్రైన్ ముందుకు కదులుతోంది వెన్నెల్లో.

నీరజ కిటికీదగ్గరకూర్చుని వెన్నెలలోకే చూస్తోంది. ఆమె దృష్టిమాత్రం వెన్నెల్లో లేదు. ఏ ధ్యాసమీదలేదు ఆమెఒడిలోకూర్చున్న ఏడాదిబాబు లేచినిలబడి కిటికీలోంచి తొంగిచూడాలని ప్రయత్నిస్తూంటే బాబును పట్టుకుంటూ వెన్నెల్లోకే చూస్తోంది, ఆమె ప్రక్కన కూర్చున్న అయిదేళ్ళ నిర్మల బొమ్మల

# రాజీనామా

పుస్తకాన్ని తదేకంగా చూస్తోంది. చంద్రశేఖరం వెన్నెల్లోకి చూస్తున్న నీరజనే చూస్తున్నాడు. అతను తన్నే చూస్తున్నాడని ఆమెకు తెలుసు గాని అతనివైపు తిరిగి చూడటంలేదు. ఆమె మౌనాన్ని భగ్నంచేసి ఆమెనెలా మాటాడించటమో అర్థంకావటం లేదు. అతను ముందుకు వంగాడు. బాబుని చేతిలోకి తీసికొన్నాడు. నీరజ తిరిగిచూచింది.

"నీరజా! నామీద నీకు కోపంపోలేదు కదూ!" అన్నాడు.

"మీమీద కోపం నాకెందుకు?" అంది నీరజ.

"కోపం కాకపోతే బయలుదేరిన దగ్గర నుండి నీవెందుకంత నిర్లిప్తంగా ఉన్నావు."

"మనిద్దరి ట్రాన్స్‌ఫర్ విషయం చివరి వరకూ నానుండి మీరు చాల రహస్యంగా ఉంచారు. అందుకు బాధగాఉంది. కోపం నా కెందుకు?" అంది తలవంచుకునే.

"నేను ట్రాన్స్‌ఫర్‌కోసం ప్రయత్నిస్తున్నానని నీకు తెలిస్తే నీవు నాప్రయత్నాన్ని సాగనివ్వవని నాకు తెలుసు."

నీరజ మాటాడలేదు.

"సహనానికికూడ ఒక హద్దుంది నీరజా! మనషులు మనుషులే! కాని యంత్రాలుకారు. కాలేరు. మన పెళ్ళయిన తరువాత నీచేత ఉద్యోగం చేయించానేకదా! ఉద్యోగం మానేస్తానన్న నీవు ఉద్యోగం చేస్తానంటే నే కాదనలేదుగా. మీ అన్నకు ఉద్యోగం వేయించే మావగారు దొరికారు. ఉద్యోగం అయింది. పెళ్ళి అయింది. 'అన్నయ్యది కొత్త సంసారం నీవు ఉద్యోగం మానేస్తే ఎలా?' అని మీఅమ్మగారన్నదంటే నీయిష్టప్రకారమే కానివ్వ లేదూ: పెళ్ళయిన ఆరునెలలకే మీ అన్నయ్య వేరేకాపురం పెట్టుకుని వెళ్ళిపోతే ఉద్యోగం చేయటం అనివార్యమైతే నే కాదనలేదుగా. పితమ్ముడి చదువుపూర్తయింది. అతనూ ఉద్యోగం సంపాదించుకున్నాడు. అతను తెచ్చే జీతంతో సంసారం నడవకపోదు. ఇక నీవు ఉద్యోగం చేయటం అనవసరం. కాని మీవాళ్ళు నీముందు కనిపిస్తూ ఉంటే నీవు ఉద్యోగం మానవు. అందుకే ఈ ప్రయత్నం చేశాను. మనం హైదరాబాద్ చేరినతరువాత నీవు ఉద్యోగం మానేయటం తథ్యం."

అతనివైపే చూస్తున్న నీరజ "మీ రెప్పుడు మాటాడినా ఎదుటివారిని మాటాడలేని పరిస్థితిలోనే పెడతారు" అంది.

"నేను నిజం చెప్తాను. ఏఒక్కటీ కల్పించి చెప్పలేదుగా. నీమంచితనాన్ని ఒక్కనాడూ వాళ్ళు గుర్తించలేదు. అదే నాబాధ. జీత మంతా ఇంటికోసమే యిచ్చేశావు. అది నీమంచితనంగా వారికి తోచలేదు. సంపాదించి యివ్వటం ఒకహక్కుగా భావించారు. నీరజా! ఒక్కమాట. మనంఏచెట్టు నీడన ఆశయం పొంది, ఏచెట్టు ఫలపుష్పాలను పొందుతున్నామో ఆ చెట్టును రక్షించుకునేబాధ్యత, సంరక్షించుకునే బాధ్యత మనమీదుంది. కాని రెమ్మలను త్రుంచి కొమ్మలనుకొట్టి వంట చెఱకుగావాడే మనఃతత్వం నేనునచ్చను. ఎబార్షనై నీవు సెలవలోఉంటే అనారోగ్యం చేత ఉద్యోగం మానేస్తావేమో అనే భయ పడ్డారేగాని నీ ఆరోగ్యంకోసం ఆందోళనపడ లేదు. ఆ పరిస్థితిలోకూడ నీవు జీతంమీఅమ్మ చేతికిస్తే 'టానిక్కుకొనుక్కోమని' ఒక పది రూపాయలు నీ చేతిలో పెట్టలేదు. సుమారు రెండు సంవత్సరాలు నా ఆరోగ్యం బాగోక కొన్ని రోజులు, బాబు పుట్టినప్పుడు మనం ఎన్ని ఇబ్బందులతో పడ్డాము. కాని వాళ్ళేమీ తోటు చెయ్యలేదు. కాని ప్రతిఫలం ఏమిటి? ఎరియర్సుగా వచ్చిన అయిదువందల రూపాయలు తన జేబులో సొమ్ములాగ, మనకేదో అప్పు ఇచ్చినవాడిలా అడగలేదూ మీనాన్న? మనమింకా ఏ నిర్ణయం చేసికోందే మర్నాటి వుదయం కాబూలీవాడిలా వచ్చి కుర్చీలో కూర్చోలేదూ? మనం ఆ డబ్బు విషయమై ఏమీ మాటాడలేదనేకదా వారం రోజులు ముఖం చూపించలేదు. ఎదుటపడినా పలకరించలేదు. అంటే అక్కడికి, నాళ్ళు పలకరించటమే మహోపకారంగా నీవు భావించాలన్నమాట. అంతేకదూ. ఆనాడు నా చేతికిచ్చిన సొమ్ము గురించి ఇంతవరకూ ఏనాడు అడగలేదు. కాని ఎప్పుడో ఒకప్పుడు చెప్పాలి కాబట్టి చెప్తున్నాను. ఆ అయిదు వందలు గిరిజకోసం ఫిక్సెడ్ డిపాజిట్‌లో వుంచాను. గిరిజ పెళ్ళి ఎప్పుడయితే అప్పుడు వడ్డీతో సహా నీవే గిరిజకు అందజేద్దువుగాని." ఆగాడు చంద్రశేఖరం.

నీరజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మాటాడలేకపోయింది.

"నీరజా! నీవు నన్ను పెళ్ళిచేసుకుని ఏమీ సుఖపడలేదు. కాని ఎవరికీ ఏ లోపం రానీయలేదు నీవు. ఇంతవరకూ ఏమీ చేయడానికి నాకు అవకాశం రాలేదు. ఇప్పుడు అవకాశం ఏర్పడింది. ఆ లోటేలోపం చెయ్యను" అన్నాడు.

కొన్నిసేపు మౌనంగా వుండి తలఎత్తి అతనివైపు చూచి, అతను ప్రశాంతంగా ఉండటం కనిపెట్టి "నేనొక మాట చెప్తాను కోపగించుకోరుగా" అంది నెమ్మదిగా.

అతను నెమ్మదిగా తల పంకించి "ఉద్యోగం చేస్తానని అంటావు. అంతే కదూ!" అన్నాడు.

"అవును. గిరిజ, పార్వతి అమాయకపు పిల్లలు. వాళ్ళ గురించి పట్టించుకునే వాళ్ళెవరూ లేరు. మనం కూడా వదిలేస్తే వాళ్ళ గతి ఏమిటి? వాళ్ళకోసమే ఇంతకాలం ఎన్ని బాధలైనా, కష్టాలైనా సహించాను. గిరిజ పెళ్ళయితే చాలు, గిరిజ పార్వతి గురించి



ఆలోచించగలదు. అంతవరకు ఉద్యోగం చేయనివ్వండి ''

అతను సన్నగా నవ్వాడు.

''నీవీ మాట అంటావని భయపడుతూనే ఉన్నాను నీరజా!...''

''కానీ మీ రెలాగైనా ఒప్పుకుంటారని నాకు నమ్మకముంది. గిరిజ ఎంత మంచి పిల్లో మీకు తెలియదూ? నా ఆరోగ్యం బాగా లేనప్పుడు అమ్మా, నాన్నకు తెలియకుండా రహస్యంగా వచ్చి నన్ను చూచి ఇంట్లో కావలసిన నాలుగు కనుక్కుని, అమర్చి పెట్టి వెళ్ళేది కాదూ? మీరే చెప్పండి; నేనంటే దానికెంత అభిమానమో!''

''నీవు ఉద్యోగం చేసినంత మాత్రాన గిరిజ పెళ్ళి కాదు. నీవు యింటికి డబ్బు పంపిస్తే అది గిరిజకుపయోగపడదు. అంటే గిరిజకోసం నీవు ప్రత్యేకంగా బ్యాంకులో వెయ్యాలి. నీవు ఉద్యోగంచేస్తూ డబ్బు తమకివ్వడంలేదని మీ ఇంటిలో తెలిస్తే వారితో నీకు వైరం తప్పదు. వాళ్లతో నీకు వైరం కావాలంటే నీ యిష్టమే కానియ్యి.''

''నాకు ఈ మనుషుల తత్వం బాగా తెలుసు. తొంభయి తొమ్మిదిసార్లు ఉపకారం చేసి నూరవసారి ఏ కారణంచేతనైనా ఉపకారం చేయకపోతే వైరంకొని తెచ్చుకునే రకమే వీళ్ళు. మంచి చేసేవారు ఎప్పుడో ఒకప్పుడు వీళ్లకు శత్రువులుకాక తప్పరు. అలాంటి వాళ్లచేత మంచి అనిపించుకోవడం కూడ నాకు యిష్టంలేదు. వారేమనుకున్నా నే బాధపడను. ఎప్పుడూలేని ఆదరణ, పిలుపులు యిప్పుడు లేవని బాధపడను గిరిజ సుఖపడ్డం నాకు కావాలి. అందుకు మీ సహకారం కావాలి. అంతే.'' అంది నీరజ.

''ఇవ్వాళ గిరిజ, రేపు పార్వతి, ఇంకో రోజు ఇంకోటి. గిరిజలో మంచితనం కొంతే ఉండవచ్చు. కాని నీవు మంచి మనసులోనే చూస్తున్నావు. అందుకనే గిరిజ నీకు ఎంతో మంచిగా కనిపిస్తోంది. నీవు ఆర్ద్ర హృదయంతో ఉన్నంతకాలం నీవు ఉద్యోగానికి రాజీనామా యివ్వలేవు. ఇది నేను చెప్పిన మాట. అయితే నా మాటలు నీకు నచ్చవు. కాలమే నీకు తెలియజేస్తుంది. నీ ఇష్టమేకానియ్యి'' అన్నాడు.

నీరజ కొద్దిసేపు మౌనంగా వుండి ''కోపం వచ్చిందా?'' అడిగింది.

''లేదు. నిన్ను సుఖపెట్టలేకపోతున్నాను కదా అని బాధగా ఉంది అంతే'' అన్నాడు.

''ఇప్పుడు నేను సుఖపడటంలేదని మీ రెందుకనుకోవాలి? కష్టపడటం లోనే కొందరికి సుఖముంటుంది'' అంది నీరజ.

''అలా చెప్పుకునే నేను మనసు సరిపెట్టుకోవాలి''

ట్రైన్ ఆగింది.

''ఏమైనా కావాలా?'' అడిగాడు.

''మంచినీళ్లు పట్టండి'' అంటూ వాటర్ బాటిల్ అందించింది నీరజ

చంద్రశేఖరం నీళ్లకోసం వెళ్లిపోయాడు

నిద్రపోవటానికి ఒక్కపక్కకు ఒరుగుతున్న నిర్మలను పడుకోపెడుతున్న నీరజ పైబెర్తునుండి క్రిందికి దిగుతున్న వ్యక్తిని చూచి ఆశ్చర్యపోయింది.

''ప్రకాశంగారూ! మీరా!! ఎంత కాలానికి?'' అంది అప్రయత్నంగా.

''నేనే నీరజా! మీరు ట్రైన్ ఎక్కటం చూచినప్పుడే పలుకరించా లనుకున్నాను. కాని మీరు సంభాషణలో పడ్డారు. మీ సంభాషణను భగ్నపరచలేక పోయాను. మీ మాటలన్నీ విన్నాను. అతను చెప్పిన మాటల్లో ఎంతో సత్యం నాకు కనిపించింది. ఎదుటిమనిషిలో ఉన్నది కొంత మంచి అయినా మన మనసు మంచిదైనప్పుడు అంతా మంచిగానే కనిపిస్తుంది. అలాంటి మనసుండటం చేతనే సుఖంలేక పోతున్నది...... ఆ!... మీపిల్లలా ...ఇద్దరేనా?...నీ పెళ్ళయి నాలుగేళ్ళయింది కదూ!'' నిర్మలవైపు బాబువైపుచూస్తూ

''పెళ్ళయి ఐదేళ్ళయింది ఈ బాబు నా సంతానం. నిర్మలను మా పెళ్ళికి చూశారుగా'' ''అవును మీరిప్పుడెక్కడికి వెళ్తున్నారు?''

''హైదరాబాద్! మీరు నా పెళ్లయిన సంవత్సరమే బెజవాడ వెళిపోయారు. ఇప్పుడు ఎక్కడ పనిచేస్తున్నారు?''

''ఇప్పుడు గుంటూరులో. ఒక స్నేహితుని కలియటం కోసం ఇటువైపు వచ్చాను. ఎలాగా ఇటు వచ్చానుకదా అని మాతమ్ముడు పనిచేస్తున్న ఈ ఊరిలో దిగబోతున్నాను. నీవు మాత్రం చాల చిక్కిపోయావు. మీ ఆయన చెప్పినట్టు కాకపోయినా కొంత కాలమైన సెలవుపెట్టి విశ్రాంతి తీసుకోకూడదూ!''

''మనసును బాధపెట్టే ఆలోచనలే మనసులో తిరుగుతున్నంతసేపూ విశ్రాంతిలో హాయిలేదు ప్రకాశరావుగారూ? నాకు చేతినిండా పనివుంటేనే మానసిక విశ్రాంతి.''

''మీ యింటి ఆలోచనలే నిన్ను బాధపెడుతున్నాయి కదూ?''

''లేదు డబ్బుతెచ్చి నాన్నచేతిలో పోయటం తప్ప నేను వాళ్ళ ప్రవర్తన గురించి ఏనాడూ పట్టించుకోలేదు.''

''చంద్రంగారు మంచివారేనే? మరి నీమనసును బాధపెట్టే ఆలోచనలేమిటి?

''ఎందుకా హృదయపరీక్ష?''

''నీ స్నేహితుడిగా నేనామాత్రం తెలిసికోకూడదా?''

''తెలిసికున్నా ఇప్పుడు మీరు మాత్రం ఏం చేయగలరు?''

ప్రకాశరావు కొద్దిసేపు మౌనంగా ఉండి ''కోరుకున్నదేదో అందలేదన్న బాధతో మనసు పాడుచేసి కుంటున్నావేమో. అదే నిజమైతే అది చాల తప్పని చెప్పాలనే నా ఉద్దేశ్యం. నీవు అదృష్టవంతురాలివి నీరజా! నీవు నాకోసం వేచివుండకపోవటమే మంచిదైంది. నేను బాధ్యతలకు రాజీనామా నివ్వలేక పోతున్నాను. నీవు ఉద్యోగానికి రాజీనామా నివ్వలేక పోతున్నావు. మనిద్దరివీ ఒకే రకం కథలు. కొద్దిమార్పులంతే. నిన్ను మనుషుల చెడ్డతనం బాధిస్తుంటే నన్ను మనుషుల మంచితనం బాధిస్తున్నది. నాగురించి చెప్పుకునే వ్యవధిలేదు. నీవు మాత్రం గిరిజ పెళ్ళయిపోయినతర్వాతనైనా ఉద్యోగానికి రాజీనామా చెయ్యి. వస్తాను. మళ్లా ఎప్పుడైనా 'ఎక్కడైనా కలుద్దాం'' అంటూ ఎయిర్ బ్యాగ్ అందుకుని ద్వారం వైపు నడిచాడు ప్రకాశరావు.

ప్లాట్‌ఫారంమీద త్వరగా నడుచుకుంటు ముందుకు పోతున్న ప్రకాశరావును చూస్తూ కళ్లల్లో నిలిచిన కన్నీళ్లను తుడుచుకుంది నీరజ.

**దీపావళి కథలపై బ్యాలట్ గడువు 20—11—'76తో ముగుస్తుంది**

# ప్రశ్నావళి
## కె. రామలక్ష్మి

డి జి ఆర్ బొంబాయి.

మీ సమాధానాలను విమర్శిస్తూ వచ్చిన పాఠకుల ప్రశ్నలకు మీరిచ్చే జవాబులు చదువుతూ వుంటే మీలోని చీకటికోణం అర్థం అవుతూంటుంది.

నిత్యం ! ప్రతి వ్యక్తిలోనూ వుంటుందో చీకటికోణం. అందరూ మహానుభావులే అయితే చీకటికి చోటుండదు కద.

బి.కె ఆర్ మద్రాసు.

ప్రేమ గుడ్డిదన్నారు అనుభవజ్ఞులు. గుడ్డిదాన్ని ప్రేమించడం ఎందుకు ?

ప్రేమ గుడ్డిది అనడంలో భావం గుడ్డిదాన్ని పెళ్లాడమనికాదు. ప్రేమగుడ్డిది అంటే 'తాను ప్రేమించిన స్త్రీ రంభలాగా తోస్తుంది తన కళ్లకి' అని !

టి ఎస్.ఆర్ సంగారెడ్డి.

స్త్రీలు ఏ విషయం మనస్సులో దాచిరు. కారణం?

ఆడవాళ్ల నోట్లో నూగింజ నానదన్న సామెత నమ్ముతున్నారా ? ! అదో అబద్ధం. తన వ్యక్తిత్వాన్ని కించపరిచే ఏ పరిస్థితినైనా మనస్సులో పాతేసుకుని నవ్వుతూ బ్రతుకుతున్న ఆడవారిని చూడలేదా ?

బి పి ఆర్ రాయిగడ.

లోభి గాడికి ఏం చేయాలి

పొదుపు చిట్కాలు నేర్పించాలి !

వి ల్ న్ ఎస్. కురబాలకోట.

ఇల్లరికం వచ్చిన మగవానికి, కోడలుగా వచ్చిన ఆడదానికి గల తేడ ఏమిటి ?

ఇల్లరికం వచ్చిన అల్లుడికి అడుగులకి మడుగులొత్తుతారు—తుమ్మితే వూడిపోయేవ ముక్కులాగా చూసుకుంటారు— ఏమంటే ఏం కోపం వస్తుందో ఎక్కడ వెళ్లిపోతానంటాడోనని. కాని కోడలితో ఆ బాధలేదు. కట్నం యిచ్చుకుని వచ్చినా ప్రేమించి పెళ్లి చేసుకుని వచ్చినా, ఎలావచ్చినా అత్తవారింట కొత్తకోడలే పాతపడ్డ బాధ్యతలు పెరుగుతాయితప్ప విశ్రాంతి చిక్కదు. ఎవరూ ఆమెకి భయపడరు. ఎవరికీ ఆమెని ఆదరించాలన్న బాధ్యత వుండదు. ఎవరి కోసం వుంటుందన్న దీమా వారి నలా చేస్తుంది !

ఎస్ ఆర్ సి. నల్గొండ.

మీలా ప్రశ్నకు సరైన జవాబు దెబ్బకు దెబ్బ లాగ యివ్వాలంటే ఏం చెయ్యాలి ?

ఏంలేదు. పాపం ఏసుక్రీస్తులాగా వో చెంప కొడితే— 'యిటూ కొట్టు' అంటూ రెండో చెంప అందించకపోవడమే. ఒకటంటే— నాలుగంటాన్న భయం కల్గించడమే బ్రతకడానికి దారి !

వి.మ ప. ఉరం పురం.

మనస్సు బాధగా ఉన్నప్పుడు ఏం చేయాలి ?

జరిగిపోయినదాన్ని, జరిగిపోయినదిగాగుర్తించి ఫలితాలు ఎటుల్నోనే ప్రయత్నాలు చెయ్యాలే గాని, దాన్ని గురించి తలచితలచి బాధపడ్డం దండుగ. పని జరుగుతూంటే మనసు అదే కుదుటపడుతుంది.

ఆడవాళ్లను నేను నమ్మను.

అది మీ కర్మ !

కె.ఎస్ ఆర్. హైదరాబాదు.

నేను బి. ఎస్. సి. పాసయ్యాను. నాకు ఉద్యోగం యిప్పించుతానని వో పెద్దమనిషి హామీనిచ్చి పెళ్లచేశాడు. నాల్గు సంవత్సరాలైంది. ఇప్పుడు నిరుపేద నిరుద్యోగిని.

ఉద్యోగం కోసం పెళ్లాడ్డం ట్రాన్సిస్టరు కోసం కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్నానని చెప్పినట్లుంది. నిరువుకాళ్ల మీద నిలబడాలని ఉబలాటపడ్డం మీరు చేసిన పొరబాటు.

ఐ.ఆర్.ఆర్. విశాఖపట్నం.

మీ ఆడవాళ్లు అలంకరణలోను, అలంకరణే ఒక క్వాలిఫికేషన్‌గా ఉద్యోగాలు సంపాదించడం లోనూ తప్పిస్తే ఏ విధంగా ఎందులో ముందంజ వేశారో చెప్పండి.

ఇలా ఒకళ్ల మీదపడి ఏడవకుండా ఉండడం కూడా ముందంజ వేయడమే తమ్ముడూ, మీ సోదరిని, మీ భార్యని, మీ తల్లిని, మీ చుట్టాలమ్మాయిని గురించి యిూ మాట అనగలరా అలంకరణే ఒక క్వాలిఫికేషనుగా కనీసం రిసెప్షనిస్టు ఉద్యోగం కూడారాదు. అదిముందు గ్రహించండి మీరు.

ఉమ. ఎలమంచిలి.

ఈ వారం స్వర్గం— నరకం చిత్రంపై రామలక్ష్మిగారి జవాబు చూశాక వారిపై మాకున్న సదభిప్రాయం తొలగిపోయింది.

పీడా పోయింది ! మరీయిలా అటా— యిటా అంటూ వూగిసలాడే అభిప్రాయం సదభిప్రాయం అయినా కాకపోయినా ఒకటే.

రాజశేఖరం తాడేపల్లిగూడెం

పెద్దవాళ్లు సంపాదించిన ఆస్తి చాలా వుంది. కష్టపడకుండా తినడం నాకు యిష్టం లేదు. .

సరిగ్గా సులోచనారాణి హీరోలా పేరుకు తగ్గట్టు వుంది— మీ పరిస్థితి! ఈ వార్త ఏ పేపరులోనైనా ప్రకటించండి— సవాలక్షమంది వస్తారు. మీ కష్టం పంచుకుందుకు(సారీ— మీ ఆస్తి పంచుకుందుకు)

కె బి ఆర్ బొంబాయి

మనస్సూ మనిషికి సుఖం లేదంటారా?

ఎందుకు లేదు— మనసున్నదే సుఖం మీద కద !

ఎస్. ఎస్. హైదరాబాదు

మీ పేరులో వున్నటువంటి లక్ష్మి కాక యింకా ఎంత నల్ల లక్ష్మి వుందో వివరికి తెలుసు?

నేనే నల్లలక్ష్మినని అందరికీ తెలుసు! అయినా నల్లధనం 'లక్ష్మి' అవదు. భయం అవుతుంది.

కె. కె. కె. జగ్గయ్యపేట

స్త్రీలకు స్వాతంత్ర్యం యివ్వకూడదం టారు ఎవరు ! స్వతంత్రం, వ్యక్తిత్వం, స్వశక్తి ఒకరు యిచ్చేవి— ఇంకొకళ్లు పుచ్చుకొనేవి కావు. స్వతహాగా వుంటాయి.



అమ్మా,
వాళ్ళ
బాత్‌రూమునుండి
అంత చెడ్డ
వాసన వస్తుందేం,
మనదాంట్లో మంచి
వాసనేస్తుండగా?

మనం
ఓడోనిల్
వాడతాముగామరి!




ఓడోనిల్ భరించలేని దుర్వాసనలను మరుక్షణంలో దూరం చేసి మీ మరుగు దొడ్డిని పరిశుభ్రంగా తాజా సువాసనలతో నింపుతుంది. ఓడోనిల్ అనేక సువాసనలలో లభిస్తుంది. రకరకాల సైజులలోనూ, నమూనాలలోనూ, ప్యాక్‌లలోనూ లభిస్తుంది.

**బల్సారా**

—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS-6 Tel

# వారఫలం

మహేష్

**12-11-1976 శుక్రవారం మొదలు**
**18-11-1976 గురువారం వరకు**

**మేషం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు— సంతోషకరమయిన వార్తలను వింటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిథునం :—** నూతన వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకుంటారు.

**కర్కాటకం :—** పోటీవారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :—** ఫలితంలేని శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య :—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి, వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**తుల :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— పోటీవారిలో గౌరవం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు :—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమయిన వార్తలు వింటారు. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :—** రావలసిన డబ్బు అందగలదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**కుంభం :—** వృత్తిలో పోటీదారి పోటీ పెరుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చికాకులు ఏర్పడతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :—** ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

చక్రపాణి ఆర్ట్ పిక్చర్స్

సమర్పించు

# పెళ్ళికాని తండ్రి

నిర్మాతలు: పి. వీరేశం, పి. లక్ష్మారెడ్డి M.A., L.L.M. దర్శకత్వం: బి. పద్మనాభం

LAKSHMIDUBS

లక్ష్మీ ఫిలింస్



# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

## మంత్రి వెంకట్రామరెడ్డి మృతి

మృత్యువు ఎవరినీ కనికరించదని, అందులోను తనతో పోరాడేవారిని ససేమిరా కనికరించదని మంత్రి శ్రీ వెంకటరామరెడ్డి మృత్యువు మరొక సారి నిరూపించింది. వెంకటరామరెడ్డి ఎంతో కాలంగా మృత్యువుతో హోరాహోరిగా పోరాడారు. చివరకు అక్టోబరు 14 మధ్యాహ్నం శాశ్వతంగా ఓడిపోయారు. ఆ సాయంకాలం ఆయనకు అంత్య సంస్కారం అంబర్‌పేట శ్మశానవాటికలో జరిగింది.

వెంకటరామిరెడ్డి జననం హైదరాబాదు జిల్లా మేడ్చల్ తాలూకా గౌడవల్లి గ్రామంలో 1931 జనవరి 15 న. పట్టభద్రులయారు. 1947 లోనే రాజకీయాలలో ప్రవేశించి 1954 లో జాతీయ విద్యార్థి సంఘం కన్వీనరు అయ్యారు. మేడ్చల్ తాత్కాలిక పంచాయితీ సమితి ప్రధానాధ్యక్షులుగా, సమితి అధ్యక్షులుగా హైదరాబాద్ జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాధ్యక్షులుగా, నైవేలి లిగ్నైట్ సహకార సంఘ డైరెక్టర్ల బోర్డు సభ్యులుగా ఇంకా ఎన్నో సంస్థలలోను వున్నారు. తెలంగాణా ప్రజాసమితి కాంగ్రెస్‌లో లీనమయ్యేవరకు, దాని కార్యదర్శిగా ఉన్నారు. హైదరాబాద్ జిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గం నుండి విధాన పరిషత్తుకు ఎన్నికయ్యారు. 1974 లో వెంగళరావు మంత్రివర్గంలో చేరారు. ఉత్తరప్రదేశ్ గవర్నర్ డాక్టర్ చెన్నారెడ్డి, రాష్ట్ర గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్, ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు మున్నగువారు జోహార్లర్పించారు.

## శ్రీ ఆర్. సురేష్‌బాబు చిత్రాలు

బుద్ధిని ఎంతో వేధించిగాని అర్థం చేసుకోలేని, పూర్తిగా అర్థం గాని నిర్వికల్ప (నైరూప్య) చిత్రకళలో విసుగెత్తిన లలితకళా ప్రేమికులకు అక్టోబర్ మూడవ వారంలో కళాభవన్‌లో జరిగిన శ్రీ ఆర్. సుభాష్‌బాబు చిత్రకళా ప్రదర్శనం హాయి కలిగించింది. దీనిలో 15 ఉడ్‌కట్ ప్రింటు, తైలవర్ణచిత్రాలున్నాయి. సహజమైన వస్తువును చిత్రించడం కళాకారుని సమయజ్ఞతకు, ఉపజ్ఞతకు, ధైర్యానికి తార్కాణమంటారు. ఈ దృష్టితో చూచినప్పుడు సుభాష్‌బాబు బలహీన వర్గాల సముద్ధరణ, వారి జీవితాన్ని ఆనందమయం చేయడానికి ప్రభుత్వప్రయత్నం— వంటి చిత్రాలు ఉన్నత స్థాయివి. తైలవర్ణ చిత్రాలలో గయ్యాళి, సాధువు— అనే చిత్రం రెండు పరస్పర విరుద్ధ భావాలను చూపడంలో కృతకృత్యమయింది. ప్రకృతి— అనే చిత్రం రాత్రి అనే చిత్రం రంగుల కలయికలోను నిత్య ద్వంద్వాలయిన సుఖ దుఃఖాల, శీతోష్ణాల చీకటి వెలుగులను గొప్పగా చిత్రించాయి. సుభాష్‌బాబు గుంటూరు జిల్లాలో జన్మించారు. హైదరాబాద్ చిత్రకళాశాలలో పట్టభద్రులై ప్రొఫెసర్ కె. జి. సుబ్రహ్మణ్యం దర్శకత్వంలో ప్రత్యేక కృషి చేశారు. ప్రస్తుతం బేగంపేటలోని హైదరాబాద్ పబ్లిక్ స్కూలులో లలితకళో పాధ్యాయులుగా ఉన్నారు. హైదరాబాద్ కార్పొరేషన్ స్పెషల్‌ఆఫీసర్ శ్రీ నరేంద్రలూథర్ ప్రారంభోత్సవం జరిపారు. శ్రీ హెచ్. ఎల్. దత్, సాలార్‌జంగ్ మ్యూజియండైరెక్టర్ డాక్టర్ ఎం. ఎల్. నిగమ్ కళలకు ప్రజాభ్యుదయానికి గల సంబంధాన్ని గూర్చి ప్రసంగించారు.

## అటవీశాఖ జాగరూకత

రాష్ట్ర అటవీశాఖవారు ఇటీవల దాదాపు రెండున్నర కోట్ల రూపాయల విలువ చేసే 76 వేల కిలోగ్రాముల దొంగ గంజాయి పంటను,

(38 వ పేజి చూడండి)

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

*(గత సంచిక తరువాయి)*

ఆనాడు బల్లార్షాలో దిగిపోయిన గాంధీ పనులు ముగించుకుని వార్ధా వెళ్లవలసివచ్చింది. అతను సేవాగ్రాంలో కొన్ని రోజులున్నాడు. గాంధీగారి కార్యక్రమాలకి అనుగుణంగా తెల్లవారుఝామున లేవడం మొదలు భజనా, కార్యక్రమాలతో రాత్రి వరకూ గడిపేవాడు. అతను అనుకున్న ప్రకారం హైదరాబాద్ వెళ్లలేకపోయాడు.

వరంగల్‌లో తన స్వగ్రామానికి వెళ్లాడు. అతను యింటికి రావడం చూసి బంధువులూ స్నేహితులూ వచ్చారు. సాయంత్రం వరకూ అందర్నీ పలకరించి యింట్లోకి ప్రవేశించగలిగాడు.

తండ్రి మంచంమీద పడుకుని వున్నాడు. అయనది దృఢమైన శరీరం. జైలుకి వెళ్లివచ్చిన వ్యక్తి ఆయన. అరవై ఏళ్ళు దాటినా వుక్కు పిడుగులా వున్నాడు. ఆయన మాట వేదవాక్కు లాంటిది. వరంగల్ వెళ్లాలంటే కాజీపేటలో బస్ ఎక్కాలి. బస్‌లైనా చాలా అరుదుగా వుంటాయి. ఒక్కోసారి ఎడ్లబండి తనే తోలుకుంటూ వెళ్లిపోతాడు. నారాయణ బాబ్జీ కలకత్తా, పాట్నా, పూనా జైలు యాత్ర చేసివచ్చాడు. రాజకీయాలంటే ఈ క్షణం వరకూ చెవి కోసుకుంటాడు. ఇందిరాగాంధీ అంటే చాలా యిష్టం ఆయనకి. ఆడపిల్ల అంటే అదీ అలా వుండాలి అనుకుని అక్కడికి ఆమె తన కూతురే అయిపోయినట్లు మురిసిపోతూంటాడు. రెండు మాటలు పూర్తిగా మాట్లాడి మూడో మాట ఇందిరాగాంధీ రాజ్యాంగ విధానాన్ని మెచ్చుకుంటూ గంటల తరబడి వుపన్యాసాలు యిచ్చేస్తూంటాడు. ఆయన వుండేది మాను కొండ. వూళ్ళో మొత్తం ఏ యాభై యెభ్యై, వంద గుమ్మాలు వుంటాయి. ఆ ప్రదేశం మొత్తం ఒక పంచాయతీరాజ్ క్రిందికి వస్తుంది. అక్కడ పిల్లలు చదువుకుందుకు పెద్ద స్కూల్ వుంది.

నారాయణబాబ్జీని పట్నాయక్ బాబు అంటారు. అక్కడ వీళ్ళూ వాళ్ళూ అని ప్రత్యేకం ఏమీ లేదు అన్ని కులాలవారూ వున్నారు. తెల్లవారుతూనే కోడి కూతతో మగ్గం నేసే పద్మశాలీలు వున్నారు కమ్మరీ, కుమ్మరీ, హరిజన, గిరిజనులందరితోనూ వూరు కళ కళ లాడుతూ ఓరుగల్లుకి పసుపు గడప మాదిరి వుంటుంది. అందరికీ కాస్తో కూస్తో పొలాలు వున్నాయి. లేనివాళ్ళకి కాయకష్టం చేసే వోపిక వుంది. అందర్నీ పలకరించే ఎంకటి వున్నాడు. అందర్నీ మించి పట్నాయక్‌బాబు కొడుకు 'గాంధీ' వున్నాడు. బ్రాహ్మలున్నారు. తరతమ తారతమ్యం లేని ఐక్యత వుంది. ఇంతకన్నా తెలుగువాడికి కావలసింది ఏముందన్న గర్వం వుంది. పోలీస్ పటేల్, పట్వారీలు వున్నారు. లైట్లు వున్నాయి. హాయిగా బ్రతుకుతున్నాం అనే రాజసం వుంది.

గాంధీ వచ్చాడనగానే గడప గడపలోంచీ చిన్నా పెద్దా వచ్చి పలకరించి తృప్తిపడి వెళ్లారు.

రజాకార్ల గొడవ లెక్కడో హైద్రాబాద్, సికింద్రాబాద్‌లలో అయితే ప్రజలు గుండెలు జార్చుకుంటూంటే పట్నాయక్ ఛాతీ చూపించి అందరికీ ఆశ్రయం చూపించాడు.

పిల్లల్ని హైద్రాబాద్‌లో హాస్టల్లో వుంచి చదివించాడు పట్నాయక్. పిల్లలందరూ పెద్దవాళ్ళయారు. వుమెన్స్ వెల్‌ఫేర్ డిపార్ట్‌మెంట్‌లోనూ, సోషల్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్‌లోనూ ఆడపిల్లలు వుద్యోగాలు చేస్తున్నారు. మగపిల్లలందరూ చదువులు డిగ్రీలతో ఆపేసి బాంక్‌లోనూ, అగ్రికల్చర్ యూనివర్శిటీలోనూ వుద్యోగాలు సంపాదించారు. పట్నాయక్‌కి చీకూ చింతా లేదు. పెద్ద యింట్లో యిరుగు పొరుగు పిల్లల్ని వుంచుకుని కాలాన్ని దొర్లిస్తున్నాడు. గాంధీ తండ్రి మాదిరి 'రాజకీయాల్లో యిరుక్కోలేకపోయాడు. అతనికి కోరిక అయితే వుందికానీ సాగలేదు ఎందువల్లనో. తండ్రి ఒక్కడే వున్నాడన్న దిగులు వుంది. ఏడాదికి ఒకసారి సెలవు పేరుతో యిక్కడికి వచ్చి రెండు నెలలు వుండి వెడతాడు. అతను గవర్నమెంట్ పంపగా యురోపియన్ దేశాలన్నీ తిరిగి వచ్చాడు. అతని ఆశయం కాలేజీ విద్యార్థులకి తను చెప్పేదేమిటో అర్థం చేసుకుని కనీసం ఒక్క శిష్యుడైనా పైకి రావాలని.

రాత్రి చాలా ప్రొద్దుపోయింది. ఎంకటి లోపల్నుంచి మడతమంచం తీసుకువచ్చి వాల్చాడు. తలగడ వేసి తెల్లని దుప్పటి పరిచి 'నేను పోతాన్న దొర!' అన్నాడు.

'మంచిది' అని వూరుకున్నాడు గాంధీ.

తండ్రి అతను వచ్చిన కొద్ది గంటల వ్యవధిలో ఎన్నోసార్లు అన్నాడు: 'పెళ్లి చేసుకుంటే బాగుండును' అని.

'తొందరేం నాన్నా!' అని అప్పటికి ఆవిధంగా జవాబు చెప్పాడు. మంచంమీద పడుకున్న గాంధీకి వెన్నెల పుచ్చపువ్వులా మెరుస్తూ కనిపిస్తోంది. వెండిరూపాయిలా పాలసముద్రంలా పారిజాతంలా అతనా వెన్నెలని ఎన్నోవిధాలుగా సమన్వయించుకుంటున్నాడు. 'పెళ్లి' ఆతనికీ ఆలోచన కొత్తగా వింతగా ధ్వనిస్తోంది.

'గాంధీ బాబూ!'

సన్నని మృదుమధుర స్వరం వినిపించగానే అతనా పిలుపు వినవచ్చినవైపు తిరిగాడు.

'గాంధీ బాబూ!'

రెండోసారి పిలుపు విని తలెత్తాడు. అతనికి కొద్దిదూరంలో కాదంబరి నిలుచునివుంది. అతను, రెండు నిమిషాలు దీర్ఘంగా చూసి యెవరూ అని అడిగాడు. అతనామెను వెంటనే పోల్చుకున్నాడు. కానీ ఆమె అవునో, కాదో అన్న సంశయం...అతను తిరిగి ప్రశ్నించాల్సివచ్చింది.

'అవునండి.. కాదంబరిని.'

'రా కూర్చో! గదిలో చాపవుంది. తెచ్చుకో.'

కాదంబరి చాప తెచ్చుకుని మంచానికి కొద్దిదూరంలో క్రింద పరుచుకుని కూర్చుంది.

పట్నాయక్ హుక్కా తాగుతున్నట్లు అప్పుడప్పుడు చప్పుడు వినిపిస్తోంది.

'ఈమధ్య మీరు కనిపించలేదు. రెండేళ్ళయింది కదూ మీరీ వూరు వచ్చి!' కాదంబరే అడిగింది.

'అవును...' మంచంమీద లేచి మఠంవేసుకుని కూర్చున్నాడు గాంధీ. 'పోయిన సంవత్సరం కాశ్మీర్ వెళ్ళాను. జమ్మూ అంతా ఎయిర్‌ఫోర్స్, ఆర్మీ ఫ్రెండ్సే. కాప్టన్స్, వారెంట్ ఆఫీసర్స్... వీళ్ళంతా గొడవచేసి తెలుగు గెట్ టు గెదర్ అరేంజ్ చేశారు. అందరం అటు వెళ్లడంతో యిటు రావడానికి వీలుపడలేదు.'

కాదంబరి దీర్ఘంగా శ్వాస పీల్చుకుంది. 'మీరు ఒక వుత్తరం అయినా రాయరు. బాబుగారు రోజా యెదురుచూస్తూంటారు. సెలవులు వస్తున్నాయంటే మడికొండ యెప్పుడొస్తావా అనిపిస్తుంది.'

'నాకు తెలుసు కాదంబరీ! నువ్వు వుండగా

**జరిగిన కథ-5:** తల్లి యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చిన డాక్టర్ వనితకి రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన అందంతో ఆమె హృదయంలో తిష్టవేస్తాడు. తనను ఎంతో ప్రేమగా చూచే మేనమామ భార్య శ్రీదేవి భర్తృ పరిత్యక్త అయిన తన తల్లిపట్ల నిర్దాక్షిణ్యంగా వుండటం బాధిస్తుంది వనితని. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్ ఇంజనీర్. తనను పెళ్లాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొచ్చి ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది వనిత. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణరావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. పాశ్చాత్య నాగరికతపై మోజున్న భర్త కోపతాపాలకి హడలిపోతుంది యామిని. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరగాలనుకుంటుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్లిన రావ్ అక్కడ మరో పెళ్లి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్లయిన వెంటనే అమెరికా బయల్దేరిన వనిత తండ్రిని కలుసుకోవాలనుకుంటుంది.

బాబూజీకి లోటులేదని. ఆయన్ని నువ్వు తల్లిలా ఏాసుకుంటావన్న భరోసా నాకు వుంది. అందుకే వెళ్లిపోగల్గాను.'

కాదంబరి నవ్వింది: 'మీరు అన్యాయింగా మాట్లాడుతున్నారు. మీరు బ్రాహ్మలు. మేము హరిజనులం. నేను మంచినీళ్లు యిస్తే బాబుగారు తాగినట్లు తెలిస్తే కులంలోంచి వెలేస్తారు. ఏదో ఆ గడపలో అడుగు పెట్టేందుకు దేవుని దయవల్ల అర్హత సంపాదించగల్గాను. అదే పదివేలు.'

'అది సరే నువ్విప్పుడు ఎంతవరకూ చదివావు కాదంబరీ?'

'ఎమ్. ఏ. ఫిలాసఫీ పాసయ్యాను'

'ఓ...' గాంధీ ఆశ్చర్యంగా అన్నాడు. 'అందుకే అమ్మగారు వేదాంతం మాట్లాడుతున్నారు.'

కాదంబరి నిర్లిప్తంగా వుండిపోయింది. రెండు మూడు నిమిషాల వరకూ యిద్దరికీ మాటలు రానట్లే కూర్చుండిపోయారు. కాదంబరి సంచీ దులిపి 'మీరేమైనా అనుకోండి ఈ కందికాయలూ, పల్లీలూ వుడికించి యిచ్చింది మా అమ్మ. మీ కిష్టం అని నేను తీసుకువచ్చాను. పగలైతే నా చేతిలో పల్లీలు మీరు తిన్నందుకు జనం ఏమైనా అనుకుంటారని నాకు తెలుసు. అందుకే యిప్పుడు తెచ్చాను. మీరు తప్పకుండా తినాలి' అంది.

మంచంమీద పోసిన కందికాయలూ, పల్లీలూ వొలుచుకుని తింటూ వుంటే గాంధీకి ఎంతో ఆనందంగా వుంది. అతను కాదంబరి వైపు చూశాడు. సాధారణంగా హరిజనులు అంటే నల్లటి ఆకారాలన్న అభిప్రాయం ఎవరికైనా కలుగుతుందేమో కానీ కాదంబరి మాత్రం బంగారు బొమ్మలా వుంటుంది. సన్నగా పొడవుగా హిందూ సంప్రదాయాల్ని పుణికి పుచ్చుకున్నట్లు నుదుట కుంకుమ బొట్టూ మెళ్ళో కల్తీ ముత్యాల దండా, కళ్ళకు కాటుక బాపూ నిర్లక్ష్యంగా గీసిన అందమైన రేఖాచిత్రంలా వుంటుంది.

స్వతంత్రం వచ్చాక మడికొండ రాజకీయంగా బలపడింది. బుచ్చిరాములు ఒక్కగానొక్క కూతురు కాకతమ్మని బళ్ళో చెప్పించి అక్షరాలు నేర్పించి ఆ పిల్ల అందానికీ, మాట్లాడే తీరుకూ ముగ్ధుడై పట్నాయక్ కాదంబరి అని పేరు పెట్టాడు.

హైస్కూల్ చదువు ఫాతిమా స్కూల్లో ముగించి కాలేజీ చదువులకి తన పిల్లలతోబాటే హాస్టల్లో వుంచి ఆర్థికంగా కొద్ది సహాయం



# డాక్టర్ వనిత

వేశాడు. కాదంబరి స్వతహాగా తెలివైనదే కాకుండా షెడ్యూల్ తరగతికి చెందినది కనుక గవర్నమెంట్ స్కాలర్‌షిప్పులన్నీ ఆమెకి లభించాయి. ఆమె జీవితానికి వెలుగుబాట చూపిన వ్యక్తి పట్నాయక్.

గాంధీ మొత్తం తినేశాడు. 'కాదంబరీ! కొంచెం ఆ చల్లనిచేత్తో మంచినీళ్ళు యివ్వమ్మా!'

కాదంబరి నివ్వెరపోయి చూసి నెమ్మదిగ అంది: 'నేను యివ్వడం దేనికి గాంధీ బాబూ! మీ మంచం క్రిందే ఎంకటి పెట్టి వెళ్లినట్లున్నాడు తీసుకుని త్రాగండి.'

'అబ్బ! ఒంగోలేనమ్మా! పొట్టనిండా ఈ కాయల్తో నింపేశావు. కొంచెంతీసి ఇవ్వకూడదా?'

కాదంబరి సంశయిస్తూనే అతని చేతికి అందించింది. ఇప్పుడామెకి యిరవై రెండేళ్లుంటాయి. హరిజనులలో తనకంటే యెక్కువ చదివినవాళ్లెవరూ లేరు. కాదంబరి అందరిమాదిరే మామూలు మనిషి. కోటికోరికలు లేకపోయినా ఒకే ఒక గొంతెమ్మ కోరిక వుండిపోయింది. ఆమె పెళ్లి పేరు చెప్పి కళ్ళు మూసుకుంటే అక్కడ గాంధీ కనిపిస్తాడు. ఆమెకు తెలుసు యీ సమయంలో సమాజం యెంత వెనుకబడివున్నదీ ఏవిధంగా తనను దుయ్యబట్టేదీ. అయినా మనసులో ఆ భావన ఏమాత్రం సడలించుకోలేదు. ఎప్పటికైనా తను గాంధీని యీ విషయం అడిగి తీరుతుంది. తమ మధ్య యీ స్నేహం కళ్ళు తెరిచినప్పటిది. ఇప్పుడు అది అంతకంతకు పెరుగుతుందేగానీ తరగదు. కాదంబరి వేరే విషయాలేవో మాట్లాడి వెళ్లిపోయింది. గాంధీ దుప్పటి మొహంమీదకు లాక్కుని పడుకున్నాడు.

* * *

రోజులు గడుస్తున్నాయి. అతను పాలంగట్టు వైపు వెడుతున్నాడు ఆ రోజు. కాదంబరి దూరంగా కొండకి ఆనుకుని కూర్చుంది. ఆ కొండలన్నీ ఏదో ఒక రోజున బర్మా పెట్టి కాలుస్తారు. ఆ కాలిబాట వెడల్పు చేసి భద్రకాళి గుడికి వెళ్ళేందుకు సౌకర్యాలు కలిగిస్తారు ఆమె పచ్చని పొలాల వైపూ, ఎత్తయిన కొండల వైపూ మార్చి మార్చి చూస్తోంది.

గాంధీ దూరంగా నడిచి వస్తున్నాడు. ఖద్దరు పంచె, లాల్చీ, టోపీ... నెహ్రూ వేస్ట్‌కోట్ వేసుకున్నాడు. అతను రావడం చూసి లేచి నిలుచుంది కాదంబరి. ఆమె చేతిలో యింగ్లీషు పుస్తకాలున్నాయి. అవి నెహ్రూ వ్రాసిన యిందిరాగాంధీకి లేఖలు, నెపోలియన్ బోనాపార్టే పుస్తకాలు.

అతను ఆమె దగ్గరకు రాగానే 'గుడీవినింగ్' అంది.

అతనూ సమాధానంగా 'గుడీవెనింగ్' అని 'యిక్కడున్నావా?' అని అడిగాడు.

'అమ్మవారిని చూసే అర్హత ఎలాగూ లేదు. కనీసం భక్తులు నడిచిన ఈ కంకర రోడ్డుమీద నడిస్తే వారి పుణ్యం నాకు అంటుకుంటుందేమో అని.'

'పిచ్చిదానివి' చిన్నగా నవ్వాడు గాంధీ. 'ఈ అంటరానితనం ఒకనాటికి తప్పకుండా అదృశ్యం అయిపోతుంది కాదంబరి అప్పుడు హిందువులంతా ఒకటే అనే లెఖ్ఖకి వచ్చేస్తాం.'

'ఒక మాట మీరు ఏమీ అనుకోనంటే అడగనా.'

'నిరభ్యంతరంగా.'

'మీరు పెళ్ళెప్పుడు చేసుకుంటారు.'

గాంధీ ఆమె నడుస్తూంటే ఆమె వెనుకే నడుస్తున్నాడు. ఆమె ఈ ప్రశ్న వేస్తూంటే అతను ఆగి ఆమె మొహంలోకి చూసి 'ఈ ప్రశ్న నువ్వే వేయలేదనుకున్నాను. ఆఖరికి నువ్వూ వేశావు. అబ్బా! విను. నాకూ కలలున్నాయి. ఆ కలల సుందరి ఈమధ్యే కనిపించింది. స్నేహం బలపడగానే పెళ్లి చేసుకుంటాను' అన్నాడు.

'ఎవరబ్బా ఆమె?' కాదంబరికి మనసులో చాలా సంతోషంగా వుంది. కుతూహలంగా అతని వైపు చూసింది.

'సన్నగా పొడుగా తెల్లగా బస్. యిప్పటికీ వివరాలు చాలు' పెళ్లి పేరుతో అందరూ వూదరగొట్టేస్తూంటే అతని మనసు చెదిరి వనిత మీదకి వెడుతోంది. ఆమె వివాహమై ఈ క్షణంలో ఎక్కడో వుంటుందన్న ఆలోచన లేదు అతనికి.



ఏ మూలో అతనికి గట్టి నమ్మకం వనితని తనే చేసుకోబోతున్నట్లు.

కాదంబరి నవ్వి 'మీకుకూడా కుల పట్టింపులున్నాయా' అని అడిగింది.

'నాకా!' చిత్రంగా నవ్వాడు గాంధీ. 'పట్నాయక్‌గా రబ్బాయి కులం గోత్రం అంటూ వేళ్లాడుతే యింక అయినట్లే. సమయం వస్తే నేను అన్నిటినీ తృణప్రాయంగా చూస్తాను అంతే.'

కాదంబరి అక్కడే నిలుచుండిపోయింది. అతను ముందుకు సాగిపోయాడు.

దూరంగా సూర్యుడు చెరువు అవతల ఎక్కడో ఆకాశపు అంచుల్లోకి వెళ్లిపోతున్నాడు. ఎర్రటి సూర్యబింబం చెరువులో ప్రతిఫలిస్తూంటే ఆ ప్రదేశం అంతా కుంకుం చల్లినట్లుంది. నీలపు ఆకాశం చెరువుకి చీర కట్టినట్లూ, ఎగిరే కొంగలు ఆ చీరమీద క్రీనీడలు పడే కొత్తరకం డిజైన్ అయినట్లూ కనిపిస్తోంది. ఒకవైపు పెద్ద మబ్బు తునక ప్రకృతిమాతలా కనిపిస్తూంటే నిలిచిన సూర్యబింబం కుంకుమబొట్టులా వుంది.

అతను సూర్యభగవానుడివైపు చూసి నమస్కరించి చెరువులో కాళ్ళు కడుక్కుని గుళ్లోకి వచ్చాడు. గంట మ్రోగింది. కొబ్బరికాయ అయ్యవారి చేతిలో వుంచాడు. కన్నులముందు సాక్షాత్కారం చేస్తున్న అమ్మవారి రూపాన్ని చూస్తూంటే గాంధీకి కాకతీయుల వైభవం క్షణమాత్రం వూహాకి అందుతూ జారిపోతోంది.

భద్రకాళికి నమస్కారంచేసి కొబ్బరిచిప్ప తీసుకుని బయటికి వచ్చాడు. కాదంబరి అతనికోసం ఆగి నిరీక్షిస్తోంది. 'ప్రసాదం యిదిగో!' గాంధీ అందించబోయాడు.

'సారీ!'

'అదేం!'

'సెంటిమెంటల్ ఫీలింగ్ అనండి, యిన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ అనండి. వాకైతే ప్రసాదం వొద్దు. భయం తినాలంటే!'

నవ్వాడు గాంధీ. 'మిమ్మల్ని మీరే కించపరుచుకుంటే యిక వేరేవాళ్ళని అనీ ప్రయోజనం ఏముంది?'

'హుఁ!' కాదంబరి నవ్వింది వ్యర్థంగా: 'మీరు ఒక్కరూ ఉద్ధరించడంతో అవదు మా బ్రతుకులకి పండుగ. నేను మీ యింటికి తప్ప మరెవరి యింటికీ రాలేనుకదా!'

'భలే...భలే...అసలు ఒకరి యింటికి ఎందుకు వెళ్లాలి. మా బాబూజీ నిన్ను ఏమీ అనరు. పుస్తకాలు కావలసినన్ని వుంటాయి. తీసి చదువుకో. ఇక యీ విషయం ఆలోచించి బాధపడకు కాదంబరీ!'

కాదంబరి మాట్లాడలేదు. ఆమె గాంధీతో బాటు ఒకేసారి స్కూలుకి వెళ్లేది. తిరిగి అతనితో వచ్చేది. గాంధీ తన గురించి యింతకంటే ఎక్కువ ఆలోచించడా?

ఆమె అతన్ని యీ విషయం అడగాలనే అనుకుంటోంది. కానీ ఆడపిల్ల తనే సాహసిస్తే నవ్విపోరూ! అతనికి తేలికైపోదూ... కొంత దూరం నడిచి యిద్దరూ చీలిపోయారు. అతను వరంగల్ వనిమీద వెడుతున్నాడు. కాదంబరి కాజీపేట వెడుతోంది.

* * *

సెలవులు అయిపోయాయి. అతను ఢిల్లీ వుత్తరం వ్రాశాడు వనిత పని చేసే హాస్పటల్‌కి. అక్కడినుంచి త్వరగానే జవాబు వచ్చింది, ఆమె అమెరికా వెళ్లిపోయిందనీ, పెళ్లి చేసుకుందనీ.

అతనా వుత్తరం చదివి నవ్వుకున్నాడు. లాటరీ టికెట్ కొనేముందు లక్షరూపాయలూ తనకే అన్న ఆశతో కొంటాడు. రిజల్ట్సు వచ్చేవరకూ ఆశ ఏమాత్రం చావదు. పేపర్లో చూశాక ఒక్క నెంబరులో తను పోగొట్టుకున్న ఛాన్సువైపు చూసే సగటు మనిషిలా అతనూ ఆ వుత్తరాన్ని చూసి నవ్వుకున్నాడు.

ఆ వుత్తరం అంతటితో వదిలిపెట్టలేదు. భోజనం చేస్తున్నప్పుడు తను వేసుకున్న జుబ్బా జేబులో పెట్టుకున్నాడు. భోజనం ముగించి లైబ్రరీ గదిలోకి వచ్చాక జేబులోంచి తీసి చదువుకున్నాడు. విసుగ్గా పచార్లు చేస్తున్నాడు. అనవసరంగా దాహం లేకపోయినా మంచినీళ్ళు త్రాగుతున్నాడు. గది బయటికీ లోపలికీ కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు అశాంతిగా మొహాన్ని కర్చీఫ్‌తో తుడుచుకుంటున్నాడు. అంతలోనే కుర్చీలో కూర్చుంటున్నాడు. తల పట్టుకుని టేబిల్‌పైన భారంగా వాలుస్తున్నాడు. కాదంబరి గది బయట నుంచి గమనిస్తోంది. కాదంబరి రావడంకానీ అక్కడ నిలబడటంకానీ అతనికి తెలియదు. వనిత కావాలి. వనిత నాది ... 'నాదీ నాదీ నాదీ...' అని గట్టిగా అరవాలనుకుంటున్నాడు. ఏదీ చేయడంలేదు.

[ ఇంకా వుంది ]

# గోద్రెజ్ స్టోర్‌వెల్

## ఈ స్టీల్ అల్మారాలకు సరితూగేలాగ తయారు చేద్దామని ప్రయత్నం మిగతా వాళ్ళంతా!

కొన్ని ఏళ్ళుగా గోద్రెజ్ వారు అత్యున్నతమైన స్టీలు అల్మారాలు తయారు చేస్తున్నారు. నిజానికి స్టాండర్డ్ స్టోర్‌వెల్ శ్రేణిలో 6 రకాలు. స్టోర్‌వెల్ మైనర్ శ్రేణిలో రెండు రకాలు—యీ మధ్యనే స్టోర్‌వెల్ కాంపాక్టు పూర్తి శ్రేణి తయారు చేసారు. అంతేగాక, అన్నిటికన్న ఎక్కువ జాగా గలిగిన, ఆధునికంగా రూపొందించిన స్టోర్‌వెల్ వాటితోబాటు చేర్చారు.

ఇప్పటిదాకా మిగతా వాళ్ళు గోద్రెజ్ నాణ్యతతో సరితూగేలాగ తయారు చెయ్యాలని ప్రయత్నం—గోద్రెజ్ డిజైనుతో సరిసమానంగా ఉండేలాగ చెయ్యాలని. కాని మేమే ఎప్పుడూ ముందంజ వేస్తున్నాం. నిజానికి యిది కష్టసాధ్యమే. అయినా, శ్రద్ధ శ్రమకు ఫలితం ఉంది మరి. మీకు ఎంతో మేలైన స్టోర్‌వెల్ అల్మారా యివ్వటం మా ధ్యేయం అయినప్పుడు యిది మరీ ముఖ్యమని మా ఉద్దేశ్యం.

నిజానికి చూస్తే, మా పద్ధతి మొదట్నుంచీ యిదే.

స్టోర్‌వెల్ అల్మారాని అంతర్గతంగా బలంగా ఉండేలాగ చెయ్యడంతో మొదలైంది యిదంతా. మృదువుగా ఉండే మెరిసే పెయింట్ పొరల వెనక, తుప్పు నిరోధించే, జీవితాంతం నిశ్చింతగా పనిచేసే ఆకారం ఉంది.

అధిక భద్రత కోసంగాను సునిశితమైన పద్ధతితో కొత్తగా '3-వే బోల్టింగ్ డిజైన్' రూపొందించి, దానికి ఎవ్వరూ తియ్యలేని గోద్రెజ్ తాళాన్ని బిగించాము.

మరికొన్ని కొత్త సదుపాయాన్ని అమర్చాం దీనిలో. స్పెషల్ డబల్ గ్రిప్ లాకర్. ఎవ్వరూ పగలగొట్టలేని తలుపు బందులు. దాని తోబాటు గుండ్రని చివరలు పొందుపరిచాము.

మేము కొత్తది ఏదైనా ప్రవేశపెడితే చాలు, మిగతా వాళ్ళు దానినే అనుసరించటం సమంజసంగా భావించారు.

కాని అది అంతవరకే—వాళ్ళు అంత తేలికగా అనుసరించటానికి వీల్లేని కొన్ని అంశాలున్నాయి మరి.

మేము తయారుచేసే ముఖ్యమైన ప్రతి స్థాయిలోనూ షుమారు నూరు పాళ్ళు పర్యవేక్షణ అందులో ముఖ్యమైన అంశం—మరొకరు అనుసరించటం అంత తేలిక కానిది అది.

కొత్త పద్ధతులు కనిపెట్టడంలో గోద్రెజ్ వారి ఉత్సాహంతో కూడిన కౌశలం మరొక అంశం.

మేము తీసుకొచ్చే వికాసాన్ని బలపర్చడానికి పూర్తి సౌకర్యాలున్న మా పరిశోధనా విభాగం మాకున్న ప్రత్యేకతల్లో మరొకటి.

నిజానికి చూస్తే, నాణ్యత విషయంలో అందరికన్న మేమే మా ముఖ్యమైన ప్రతిస్పర్ధులం.

దీని లోపల ప్రత్యేకమైన లాకర్ డిజైను వల్ల మీకు అదనపు రక్షణ.



**స్టోర్‌వెల్ మోడల్ 1**
—దిగుమతి చేయబడిన నిలువుటద్దం
—మీ రూపాన్ని పూర్తిగా చూసుకోవడం కోసం వీలైనది.



**స్టోర్‌వెల్ మోడల్ 2**

### కొత్త 'కాంపాక్టు' అల్మారాలు



స్టాండర్డ్ స్టోర్‌వెల్ అంత లోతు, స్టోర్‌వెల్ నాణ్యతతో. అదిగాక మీరు ఎంచుకోవటానికి ఆరు డిజైన్లు. అయినా కొంచెం పొట్టిగా, కొంచెం కోసుగా—తక్కువ జాగా వున్నప్పుడూ, పరిమితమైన ఖర్చు చెయ్యగలిగిన యిళ్ళుగల వాళ్ళ కోసం ఎంతో వీలు.

**కొత్త స్టోర్‌వెల్ 'వార్డ్‌రోబ్'**: స్టాండర్డ్ సైజు దానికన్నా ఎక్కువ లోతైనది, విశాలమైనది. అంటే సూట్ల కోసం, బట్టల కోసం మరింత ఎక్కువ జాగా లోపలే లాకర్ ఏర్పాటు, మార్చుకోవడానికి వీలైన అరలతో.





**స్టోర్‌వెల్ మైనర్**
—లాకర్‌తో గాని లేదా లాకర్ లేకుండా గాని.

ప్రఖ్యాతి చెందిన వస్తువులు నిర్మించేవారు—

**గోద్రెజ్**
Godrej

### ఉచితం!
**గోద్రెజ్ స్టోర్‌వెల్ ఫోల్డర్**

పేరిట వ్రాయండి:
గోద్రెజ్ ఎండ్ బాయిస్ మేన్యు. కం. ప్రై. లి.
4ఎ. హోమ్ స్ట్రీట్. ఫోర్ట్. బొంబాయి 400 001.

స్టోర్‌వెల్—నాలుగు అరలు గలది ఇప్పుడు కేంద్ర ప్రభుత్వ శాఖలకు డి.జి.ఎస్. అండ్ డి.రేట్ కాంట్రాక్టు ద్వారా లభ్యమవుతోంది.

U-GS-16-6 TEL

# డాక్టర్ సలహాలు

* — డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

కె. జి. ఆర్. — హైదరాబాద్

నా భార్య పెండ్లికి ముందు బాగానే వుండేది. పెండ్లి అయిన 10 రోజుల తర్వాత పిచ్చి పిచ్చిగా అరవటమూ రాత్రంతా నిద్రపోకుండా వుండటము చేస్తుంటే డాక్టరు దగ్గర చూపించాము. డాక్టరు "అక్యూట్‌మేనియా" అన్నారు. కొన్ని రోజులు బాగుంటుంది. దీనికేమి చెయ్యాలి?

★ కొందరికి మానసిక దౌర్బల్యంవల్ల చిన్నప్పటినుంచి మామూలుగా నలుగురితో కలిసి మెలిసి ఉండకపోవటం; ఊహాగానాలతో ప్రొద్దు పుచ్చటం; దొరికిన "సాహిత్యా"లన్నీ చదివి వారికి వారే "మరో ప్రపంచం" సృష్టించుకొని; నిజ జీవితంలో చలన చిత్రాలలో "డ్రీమ్ షాట్"లో చూపించే విధంగా ఉండాలని అనుకోవటం; దానికి మించి ఆచరణలో పెట్టబూనటంవల్ల వారి మానసిక స్థితి అత్యంత సున్నితంగాను, ఎవరు వారి దృక్పథానికి అడ్డు తగిలినట్లనిపించినా, వారిని ఏమీ అవలేని పరిస్థితికి దిగజారి మానసిక వ్యాకులతవల్ల బహిర్గతమయ్యే రోగలక్షణాన్నే మీరు వ్రాసిన జబ్బు అంటారు. కొన్ని రోజులు మామూలుగా ఉండటం— ఆ సమయాలలో ఆమె ఏర్పరచుకొన్న ఊహాలోకానికి భంగమేర్పడకపోవటమే!

మీరు కోరినట్లుగానే, మానసిక వైద్య శాస్త్రంలో నిపుణులను కలుసుకొని వారి సలహా పొందడం మంచిదనే నా అభిప్రాయం. మద్రాసులో గాని, రాయవేలూరు, ఢిల్లీ, మైసూర్ మొదలయిన చోట్ల ఇటువంటి రోగాలు గలవారికి, అన్ని సౌకర్యాలు, అన్ని పరీక్షలకీ కావలసిన సామగ్రి; నిపుణులైన వైద్యులు వైద్యేతరులు ఉండటం గమనించతగ్గ విషయం. మీకు దగ్గరగా ఉన్న ప్రదేశాన్ని ఎంచుకొని అక్కడకు — వెళ్లి మిగతా వివరాలు సేకరించుకోవచ్చును.

జి. ఆర్. — కరీంనగర్

ఎండాకాలంలో మామిడికాయలు తినటానికి "గడ్డలు" పుట్టడానికీ సంబంధం వుందంటారు కదా! ఇదెంతవరకు నిజం? దీనికి నివారణోపాయ మేమిటి?

★ ముందుగా విజ్ఞానదాయకమైన ప్రశ్న అడిగినందుకు మీకు నా అభినందనలు! ప్రశ్న చాలా సామాన్యంగా కనిపించినా, నిశితంగా పరిశీలిస్తే తగిన జవాబు ఇవ్వకలగటం ఎంత సులువో తెలుస్తుంది.

ఏ కాయలైనా, పళ్లైనా—పండటం అనేది— కొన్ని స్నేహపూర్వక (వాటికి) సూక్ష్మక్రిములు ద్వారా ప్రేరేపింపబడే "ఎంజైమాటిక్" — అంటే రసాయనిక మార్పులే కారణం. దీనినే రైపెనింగ్ లేక పండటం అంటారు. ఈ పండ్లను తినటం ద్వారా యీ క్రిములు — మన శరీరంలో హానికర మైనవిగా ప్రవర్తించటం, మన శరీరంలోని నిగూఢ హానికర రసాయన చర్యలు ప్రేరేపింపబడటం వలననే! దీనికి నివారణ, మామూలుగా వాడబడే "యాంటీబయాటిక్" మాత్రలు, ఇంజక్షన్లే!

పి. ఎస్. — కొండపి

నా కండ్లలో ఎప్పుడూ "గుల్లలు" లేస్తూ వుంటాయి. "ట్రీట్‌మెంట్" తీసుకొన్నా ఫలితం కనిపించటంలేదు. ఈ కురుపులు చాలా బాధ కలిగిస్తున్నాయి.

★ కొందరికి తరచూ కండ్లలో కురుపులు (రెప్పల చివళ్ళలో) ఏర్పడటం సహజంగా కనబడు తున్నదే. దీనినే— "స్టై" అనీ, "హార్డియోలం ఎక్స్‌టర్‌నం" అనీ వైద్యశాస్త్రంలో వ్యవహ రిస్తారు. దీనికి కారణం కనురెప్పల కుదుళ్లలో వున్న గ్రంథుల నాళాలు అడ్డుపడి మూసుకుపోయి వాటినుంచి ఉత్పత్తి అయ్యే ద్రవాలు పేరుకుపోయి హానికర క్రిములకు నిలయాలవ్వటమే! శరీరంలో రోగనిరోధక శక్తి తగ్గినా ఇలా ఏర్పడుతుంది. రోజూ రెండుపూటలా కండ్లలో "టెర్రాకార్టిల్" "కెనలాగ్ — ఎస్ — ఆఫ్ కార్మిక్" మొ. ఆయింట్‌మెంట్లు వేసుకోవటం దాదాపు ఒక నెలపాటు విధిగా చేయాలి. మల్టీవిటమిన్ మాత్రలు రోజుకి 3 వంతున వాడుతూ, క్రమేణా ఆహారంలోనే వీటిని పొందాలి.

జి. డి. — వాల్తేరు

"ఫైమోసిస్" అంటే ఏమిటి? ఎందువల్ల ఏర్పడుతుందో, వస్తే ఎలా నివారణ పొందాలో, అశ్రద్ధచేస్తే దానివల్ల రాగల అవాంతరాలు తెలియజేయకోరుచున్నాను.

★ పురుషుల జననేంద్రియం ("శిశ్నం" లేక లింగం) మీద ప్రకృతిసిద్ధంగా వున్న చర్మం వెనుకకు పోలేని పరిస్థితి, ఆ చర్మంలో వున్న సహజ ద్వారం చిన్నదిగా వుండటంవలననే! చిన్నపిల్లలలో (దాదాపు 10–12 సం.ల వరకూ) ఇది సాధారణం. కానీ తర్వాత యీ చర్మం వెనుకకు నెట్టగలిగే విధంగా వుంటుంది. ఇలాలేని పరిస్థితి వుంటే కొన్ని సమయాలలో రక్తనాళాలు పగలటం (చిట్లడం) వల్ల యీ చర్మం పొరలలో నెత్తురు గడ్డకట్టి, మొత్తం "ఇంద్రియం" వాస్తుంది. అలక్ష్యంచేస్తే యీ చర్మభాగం కుళ్లిపోయే ప్రమాదం వుంది. దీనికి నివారణగా, ఈ చర్మాన్ని శస్త్రచికిత్స ద్వారా తొలగించి ద్వారబంధాన్ని తొలగించడమే!

ఎం. ఎస్. ఆర్. — కరీంనగర్

నా కంఠభాగంలో చాలా సం.లుగా "ఉబ్బి" (వాపు) వున్నది. ఏదైనా ఆహారంగానీ, నీరుగానీ మింగే సమయంలో యీ ఉబ్బటం బాగా కనిపిస్తుంది. దానివల్ల నెప్పిగాని మరే బాధగానీ లేదు. దీనివలన భయమేమైనా వున్నదా?

★ ఈ వాపు "థైరాయిడ్ గ్రంథి" కి సంబంధించిందని తేలికగా నిర్ధారణగా చెప్పవచ్చును. దీనినే "గాయిటర్" లేక "అడినోమా థైరాయిడ్" అంటారు. అయొడిన్ ఆహారంలో తగినంత ప్రమాణంలో లేకపోయినా, లేక మెదడు క్రింది భాగంలోని "పిట్యూటరీ" గ్రంథి నుంచి "థైరాయిడ్ స్టిములేటింగ్ హార్మోన్" సరిగ్గా ఉత్పత్తి గాకపోయినా యిలా జరుగుతుంది. ఈ గ్రంథి పనితనం లోపించడంవల్ల ఏ లక్షణం కనబడకుండావుండదు. కాబట్టి మీరు అవి లేని దృష్ట్యా ప్రస్తుతానికి భయపడవలసిన అవసరంలేదు.

కె. హెచ్. — శ్రీకాకుళం

మా కుర్రవాని వయస్సు 20 సం.లు. వాడి 16 వ ఏట నుంచి చేతులకు ఉన్నట్లుండి వణుకు వచ్చి స్వాధీనంలేకుండా చేతివ్రేళ్ళు ఆడుతూ — (వణుకుతూ) వుండటం జరుగుతున్నది. ఎన్నో మందులు వాడినా తగ్గినట్లు కనబడటంలేదు...

★ ఈ రోగాన్ని "రుమాటిక్ కొరియా" అంటారు. ఈ రోగం రాకముందు జ్వరం రావటం— కీళ్లవాపులతో కూడి అడపాదడపా వచ్చివుండాలి ఈ రోగప్రభావం మెదడులోని కండరాల నిలకడకై వున్న ప్రత్యేక స్థానంమీద సోకటంవల్ల యిలా జరుగుతుంది. కొందరికి యీ రోగంవల్ల హృదయంలోని కవాటాలలో లోపాలు రావటం సహజం.

ఈ లక్షణాలకై "ఆస్పిరిన్" వంటి మాత్రలు వాడటం, మెదడు పనితనాన్ని మందగించటానికి "ఫినోబార్బిటోన్" తదితర "ట్రాంక్విలైజర్స్" వైద్యుల సలహాపై వాడటంమాత్రం చేయాలి.

## అన్నా! సత్యమే మిన్న!

సత్యమును దరిశించుమన్నా
నిత్యమును పూజించుమన్నా
మానవత్వము మనుచుమన్నా
మంచితనమును పెంచుమన్నా
మనుజ జన్మకు దీనికన్నా
లేదు వేరొక తెన్ను మిన్నా
కరకు దనమును విడువుమన్నా
కసాయి వృత్తిని పడకుమన్నా
మంచిదారిని పొందినంతనే
మానవత్వము పండునన్నా
అడ్డదారిని త్రొక్కినంతనె
గొడ్డు బ్రతుకై పోవునన్నా
సత్యమైనదే నిత్యమైనదట
నిత్యమైనదీ సత్యమేనట
నిత్య సత్యమే పుణ్యలోకమట
సత్యేతరమే నరక లోకమట
సత్యమునే సర్వేశ్వరు డందురు
సత్యేతరమును సైతానందురు
సత్యలోకము సప్తమ లోకము
దానిపైన లేదింకొక లోకము
సత్యమును దరిశించుమన్నా!
నిత్యమును పూజించుమన్నా!

— హృదయం

**25 పైసలు తగ్గింపు**

30 సంవత్సరాలకు పైగా
ఐటెక్స్ కాటుక మున్నగు
సౌందర్య సాధనాలను
తయారించే అరవింద్
లాబొరేటరీవారు కొత్త
ఐటెక్స్ బింది డీలక్స్
(MATT FINISH)ను
అందమైన ప్లాస్టిక్ డబ్బీలో
అట్ట పెట్టెతో దొరుకుచున్నది.






**ఇదుగో ఒక మంచి తరుణం! మీకు దగ్గరలోనున్న వ్యాపారివద్ద ఈ కూపన్‌ను ఇచ్చి, ఐటెక్స్ బింది డీలక్స్ (MATT FINISH) వెలలో 25 పైసలు తగ్గింపు వెలతో నేడే కొనండి.**

ఈ తగ్గింపు 31-1-77 వరకు మాత్రమే.

## ఐటెక్స్ రిబేటు కూపన్




ప్రియమైన వ్యాపారి,

ఈ కూపన్‌ను తీసుకొని, 'ఐటెక్స్ బింది డీలక్స్ మేట్ ఫినిష్' — 25 పైసలు తగ్గించి ఇవ్వండి. ఖాళీ పెట్టెను ఈ కూపన్‌తోబాటు జతపరచి మా ఏజెంటుకు ఇవ్వండి. వారు మీకు ఈ తగ్గింపు డబ్బును సరిచేయుటకు ఏర్పాటు చేయగలరు.

కృతజ్ఞతలు.

ఇట్లు తమ

అరవింద్ లాబొరేటరీస్

ఈ కూపన్ 31-1-77 వరకు చెల్లుతుంది.

పేరు ______________________

చిరునామా ______________________

______________________

## ★ సినిమా

### "రాజా" ఎలా వుంది ?

కాస్ట్లీ చిత్రాలు నిర్మించే కొద్దిమంది అగ్రశ్రేణి నిర్మాతల్లో ఎ. ఎల్. కుమార్‌గారొకరు. ఈ నిజం "బాబు" చిత్రం నిరూపించింది.

మారుతీ ప్రొడక్షన్స్ నిర్మించిన మరో భారీ రంగుల చిత్రమే "రాజా". ఈ చిత్రంలో హ్యూమన్ ఎలిమెంట్ ఎక్కువగా వుండడంవల్ల, కుటుంబంలో అందరికీ "రాజా" మంచి చిత్రం అనిపిస్తుంది. సంగీతం మధుర మధురంగా వుండడం వల్ల, సంగీత ప్రియులకు యీ చిత్రం బాగా వుంటుంది. యువతీ, యువకులు కోరే శృంగారం... హాస్యం శృతిబద్ధంగా వుండడంవల్ల, "రాజా" యువతరాన్ని ఆకర్షిస్తుంది.

టెక్నికల్‌గా తీసుకుంటే, స్వామి ఛాయాగ్రహణం, చక్రవర్తి సంగీతం, సత్యానంద్ సంభాషణం, ఆచార్య ఆత్రేయ గీతం సమ వుజ్జీలుగా పనిచేశాయి. దర్శకుడు రాఘవేంద్రరావుగారు ప్రతి సన్నివేశాన్ని రక్తి కట్టించారు. పాత్రధారులందరూ ప్రతిభావంతులే గనక, నటన మరోలా వుండడం సాధ్యమా ? శోభన్‌బాబు, సత్యనారాయణ, ధావు గోపాలరావు. రాజబాబు, జయసుధ, అంజలీదేవి, రోజారమణి, జయమాలిని, గిరిబాబు, సాక్షి రంగారావు ముఖ్య పాత్రధారులు. "రాజా" చిత్రం నవంబరులో లక్ష్మి ద్వారా విడుదలవుతుంది.

### నవంబర్ 12 న అమెరికా అమ్మాయి

నవత చిత్ర నిర్మించిన రంగుల చిత్రం 'అమెరికా అమ్మాయి" నవంబర్ 12 న ఆంధ్రప్రదేశ్‌లో అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదలవుతుందన్న వార్తను, నిర్మాత కృష్ణంరాజు చెప్పారు.

### చిదంబర నృత్యం !

పాశ్చాత్య నటి దేవయాని చిదంబరుని గుడిలో ప్రదర్శించిన భారతీయ నృత్యం హైలైటుగా వున్నదని, రషస్ చూచినవాళ్లు అభిప్రాయపడ్డారు. అమెరికా అమ్మాయి"గా దేవయాని హిందూ ధర్మాన్ని ఆచరించిన యిల్లాలుగా యెంతో చక్కగా నటించింది. ఆమె భర్తగా శ్రీధర్ హుందాగా నటించారు.

### రంగనాథ్ !

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడిన యువ జంటగా రంగనాథ్ ... దీప పలాకీగా, హుషారుగా నటించారు. తండ్రిగా గుమ్మడి, తల్లిగా పండరీబాయి సుఖదుఃఖాలను సమాన ప్రతిభతో పోషించారు!

### సుమధుర సంగీతం !

"అమెరికా అమ్మాయి" చిత్రంలో ప్రతి పాట మళ్లీ మళ్లీ పాడుకునే పాటగా వుండడానికి, వెంకటేష్ తీసుకున్న శ్రద్ధ ... శ్రమలే కారణం. దర్శకుడు సింగీతం శ్రీనివాసరావుగారు చిత్రాన్ని బిగువు సడలనీయకుండా... పగనిపించకుండా రూపొందించారు. ముఖ్యంగా గొల్లపూడిగారి కలం యీ చిత్రానికి బలంగా పనిచేసింది.

రాబోయే చిత్రాలలో వెరైటీ కధను గొని యున్న మంచి చిత్రంగా "అమెరికా అమ్మాయి"ని పేర్కొనవచ్చు.

### జనవరి నుంచి కొత్త చిత్రం

"జమిందారుగారి అమ్మాయి, అమెరికా అమ్మాయి" చిత్రాలను అందించిన నవత చిత్ర అధినేత కొత్త సంవత్సరంలో కొత్త చిత్రాన్ని ప్రారంభించబోతున్నారు. తన మూడవ చిత్రానికి కూడా "అమ్మాయి"ని మకుటంలో యిమడ్చ గలరేమో !

### రాఘవ కొత్త చిత్రానికి దర్శకుడు

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అంటే తెలియని వారుండరు. నేటి అగ్రశ్రేణి దర్శకుడు దాసరిని పరిచయం చేసిన రాఘవగారిని అందరికీ తెలుసు.

"తూర్పు ... పడమర" చిత్రం విడుదల అయిన తరువాత ఏమిటి అని రాఘవను ప్రశ్నించాను.

"కథకోసం వెతుకుతున్నాను. డిశంబరులో షూటింగు ప్రారంభం. ఈసారి కొత్త దర్శకుడ్ని పెట్టదలచాను", అన్నారు రాఘవ.

### హైదరాబాద్ నివాసం

హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకున్న ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేతకు, రాజధానీ నగరంలో చిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందుతుందన్న ప్రగాఢ నమ్మకం వుంది.



రాబోయే తన చిత్రాలన్నీ హైదరాబాదులోనే నిర్మితమవుతాయి, అన్నారాయన.

### ఉదయలక్ష్మి ప్రారంభం

వసూళ్ల దర్శకుడు బాపయ్య, నాచురల్ స్టార్ కృష్ణ, 'ఊర్వశి' శారద కలిసి పని చేస్తున్న ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి వర్ణ చిత్రం అక్టోబర్ యిరవై అయిదున ప్రారంభమైంది.

కృష్ణ ... శారద కొత్తతరహా పాత్రలను పోషిస్తున్న యీ చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని, రామలింగం శిల్పాన్ని, మస్తాన్‌రావు సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

నవరసభరితమయిన కథావస్తువు వున్న యీ చిత్రంలో కాంచన, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, సారధి ప్రధాన పాత్రధారులు. ఈ చిత్రాన్ని సుధాకర్, సుబ్బయ్యనాయుడు నిర్మిస్తున్నారు.

తొలి షెడ్యూలు వరుసగా పక్షంరోజులు జరుగుతుంది. డిశంబరు ఆఖరకు షూటింగు పూర్తవుతుంది అనేడి కరెక్ట్ న్యూసును నిర్మాతల్లో ఒకరయిన నన్నపనేని సుధాకర్ చెప్పారు.



'అమెరికా అమ్మాయి'లో దీప

## శేషాలు ★

### మాటల రచయిత వ్రాసిన మంచి పాట

"మానవుడు – దానవుడు, సోగ్గాడు, కవిత, పాడిపంటలు" చిత్రాలకు రమణీయమైన రచనా సంపదను వ్రాసిచ్చిన మోదుకూరి జాన్సన్ అప్పుడప్పుడు ఒక పాట వ్రాస్తూవుంటారు. ఆ పాట అందరూ మెచ్చేదిగా, పదే పదే పాడుకునేదిగా వుండడం పరిపాటిగా జరుగుతూవుంది.

శ్రీదేవి ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన "పల్లెసీమ" చిత్రంలో మధురమైన పాటలు ఎన్నో వున్నాయి. వాటిలో మోదుకూరి జాన్సన్‌గారిది ఒకటి. అదేమిటంటే :

"వీణతో నా గొంతు కలిసి పాడేవేళ
ఎవ్వరో నా గుండె మీటుతున్నారు
తీగెలా నను చుట్టి లాగుతున్నారు."

ఈ పాటను "సంగీత సరస్వతి" అద్భుతంగా పాడింది. "స్వరబ్రహ్మ" చక్కటి రాగాన్ని కూర్చారు. "పల్లెసీమ"లో సత్యప్రియ మీద యీ పాట చిత్రీకరించబడింది.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో తయారయిన యీ చిత్రాన్ని పి. బలరామరెడ్డి, ఎస్. పరంధామిరెడ్డి నిర్మించారు.

### "పల్లెసీమ" తారాగణం

శ్రీదేవి ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన "పల్లెసీమ" చిత్రం నెల్లూరు మండలంలో ప్రారంభమై, అక్కడే పూర్తయ్యింది.

గ్రామ జీవితంలో వుండే సుఖసంతోషాలు మరెక్కడా లభించవు అనేది నిజాన్ని చాటిచెప్పే యీ కథను దర్శకుడే వ్రాసి, ఆయనే చిత్రానువాదం చేసి, దర్శకత్వం నిర్వహించారు.

"పల్లెసీమ" చిత్రాన్ని జనరంజకంగా రూపొందించారు, పి. చంద్రశేఖరరెడ్డి. (ఇల్లు... ఇల్లాలు, పాడిపంటలు.)

ఈ చిత్రంలో రంగనాథ్, గుమ్మడి, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, శరత్‌బాబు, విజయరాజు, జయసుధ, సత్యప్రియ, రాధికాకిరణ్, లక్ష్మీకాంతమ్మ, రమాప్రభ మరియు రాజబాబు ప్రధాన పాత్రలను పోషించారు.

విలేజ్ బ్యాక్ గ్రౌండ్ వున్న కథలను కన్‌ఫ్యూజ్ చెయ్యకుండా, నాచురల్‌గా నెరేట్ చెయ్యగల ప్రతిభ పి. చంద్రశేఖరరెడ్డిగారికి వుంది గనక "పల్లెసీమ" చిత్రానికి గ్యారంటీ వుంది.

### ఓ. కె. డార్లింగ్

యువ దర్శకుడు భీమేశ్వరరావుకు



'చక్రధారి'లో అక్కినేని, రామకృష్ణ

"నటసామ్రాట్" ఒక చిత్రాన్ని అంగీకరించారు. చిత్రం పేరు "ఓ మై డార్లింగ్" అని పత్రికలో ప్రకటనలు కూడా యిచ్చారు.

అక్టోబరు మొదటి వారంలో నిర్మాత కోనా అప్పారావు, దర్శకుడు భీమేశ్వరరావు అక్కినేనిగారిని కలిసి, "డార్లింగ్" కథను వినిపించారు. కథను విని, చిన్ని మార్పులను నాయకుడు సూచించారు.

కథ ఓ. కే. అన్నారు డార్లింగ్ ఆఫ్ మిలియన్స్.

"ఓ మై డార్లింగ్" చిత్రంలో అక్కినేనిగారు గిటార్ సింగర్‌గా నటించగలరని, ఆయన్ను వలచే మాడరన్ గరల్‌గా జయసుధ నటించగలదని దర్శకుడు భీమేశ్వరరావు చెప్పారు.

తన కొచ్చిన మంచి అవకాశాన్ని, భీమేశ్వరరావు ప్రూవ్ చేసుకోగలిగితే, అతడి భవిష్యత్తు బలేగా వుంటుంది.

### ప్రేమలేఖలు ప్రారంభ షెడ్యూలు

అన్నపూర్ణ పిక్చర్స్ ప్రారంభించిన "ప్రేమలేఖలు" నవలా చిత్రం అక్టోబర్ ఒకట్నుంచి వరుసగా పక్షం రోజులు (హైద్రాబాదులో) జరిగింది.

ఈ నవలా చిత్రంలో జయసుధ ... మురళీ మోహన్...దీప ... అనంతనాగ్...జగ్గయ్య ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

"ప్రేమలేఖలు" చిత్రానికి సత్యానంద్ సంభాషణలను, సత్యం సంగీతాన్ని, విన్సెంట్ ఛాయాగ్రహణాన్ని, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని, మణి కూర్పును నిర్వహిస్తున్నారు.

ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణిగారి "ప్రేమలేఖలు" నవలను మధురమైన చిత్రంగా విఖ్యాత చిత్ర నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావుగారు నిర్మిస్తున్నారు.

"జ్యోతి" ఫేమ్ కె. రాఘవేంద్రరావుకు "ప్రేమలేఖలు" మరింత ఫేమ్‌ను తెచ్చిపెట్టగలదు. ఈ చిత్రం నవయుగ ద్వారా విడుదల.

### అపురూప కల్పన !

శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజస్ నిర్మిస్తున్న "కల్పన" చిత్రం అపురూపంగా వస్తుందన్న నమ్మకం యీ విలేఖరికి వుండడానికి కారణం ... క్రాంతికుమార్‌గారి ప్రీవియస్ చిత్రాలే.

"శారద ... ఊర్వశి ... జ్యోతి" చిత్రాలు టెక్నికల్‌గా యెంత గొప్పదనాన్ని తెచ్చిపెట్టాయో, జనానికి తెలుసు.

ఏదేని కొత్తదనంకోసం తాపత్రయపడే నిర్మాత క్రాంతికుమార్ "కల్పన" చిత్రంలో కూడా దానినే ప్రవేశపెట్టారు.

### జయచిత్ర పాత్ర

"కల్పన" చిత్రంలో జయచిత్రకు పూర్తిగా నటించే పాత్ర లభించింది. కరుణ, శృంగార, హాస్యరసాల మిళితమైన కల్పన పాత్రలో జయచిత్ర రాణించగల సమర్థురాలే. కథానాయకుడుగా మురళీ మోహన్, సహాయ పాత్రలను గుమ్మడి, సత్యనారాయణ, రావుగోపాలరావు, గిరిబాబు పోషించే "కల్పన" చిత్రానికి "జ్యోతి" రాఘవేంద్రరావు దర్శకుడు.



# సినిమా...



'అత్తవారిల్లు'లో ఒక సన్నివేశం

## 1977 ఎలా వుంటుంది?

1976లో కలర్ చిత్రాలు ఎంతగా నిరుత్సాహపరిచాయో, ప్రేక్షకులకు తెలుసు తెలిసినా, చిత్రాల సంఖ్య పెరుగుతున్నదేగాని, తరగడంలేదు రోజుకొక కొత్త నిర్మాత రావడం, ఆర్టిస్టుల రేటు పెంచడం పాతవాళ్లకు ఎంత యిబ్బందిగా వుందో, పరిశ్రమ ప్రగతికికూడా అంత అంతరాయం కలిగిస్తూవుంది

పంపిణీదారులు అప్పు యివ్వడానికి సుముఖంగా లేరు కొనేవాళ్లు వుత్సాహంగా లేరు ప్రేక్షకులు మంచి చిత్రాలను మాత్రమే చూడడానికి యిష్టపడుతున్నారు నెలకు సగటున అయిదు చిత్రాలు విడుదలయితే, ఒక చిత్రానికి మాత్రమే డబ్బు లొస్తున్నాయి

1975లో అనుకున్నారు 1976లో తెలుగు చిత్ర పరిశ్రమ తీవ్ర పరిణామాన్ని అందుకుంటుందని 1976లో చెప్పుతున్నారు 1977లో తెలుగు ఫీల్డు ఆశాజనకంగా వుండదని

ఎవరు ఎన్ని చెప్పినా, చిత్రాల సంఖ్య ఎక్కువ అవుతుంది చిత్రాల విడుదల దారుణంగా వుంటుంది నిర్మాణపు ఖర్చు పెరుగుతుంది నిర్మాతకు పెట్టుబడి వచ్చేది కష్టం అవుతుంది ఇన్ని జరిగినా, తెలుగు సినిమా రంగం నష్టం గూర్చి శ్వాస పీల్చదు

మన నిర్మాతల్లో సమైక్యతా భావం ఏర్పడితే, ఆర్టిస్టుల పారితోషికాన్ని కంట్రోల్ చెయ్యొచ్చు ఒక చిత్రంపై మరొకదాన్ని విడుదల గాకుండా చూడొచ్చు

1976లో కన్నా 1977లో ఎక్కువ ఫెయిల్యూర్స్ వస్తాయి అని యీ కలం వూహిస్తోంది

## శ్రీ లక్ష్మీనరసింహా కంబైన్స్!

"స్వర్గం నరకం" వంటి ఉత్తమ చిత్రం రావడానికి కారణంగా వుండిన ఎం కె మావుళ్లయ్య శ్రీ లక్ష్మీనరసింహా కంబైన్స్ పేరిట నిర్మిస్తున్న కొత్త చిత్రం నవంబరు యిరవైయెనిమిదిన ప్రారంభమవుతుంది.

ఈ కొత్త చిత్రానికి ఎమ్. ఎస్. కోటారెడ్డి దర్శకుడు. మాటలను భమిడిపాటి, సంగీతాన్ని శంకర్ ... గణేష్, ఛాయను ప్రకాష్, కూర్పును బాబు నిర్వహిస్తున్నారు.

## కృష్ణంరాజు నాయకత్వం

పాత్ర నచ్చితేనేగాని ఒప్పుకోని "రెబల్‌స్టార్" చిత్ర సమర్పకుడు మావుళ్లయ్యకు కాల్‌షీట్లు యిచ్చారంటే, కథలో కొత్తదనం వుండితీరాలి. కృష్ణంరాజు, గుమ్మడి, కాంతారావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, సారధి, ప్రభ, శుభ, అంజలీదేవి, పండరీబాయి, రమాప్రభ ప్రధాన పాత్రలను పోషించే యీ చిత్రాన్ని చింతా బ్రాహ్మణరెడ్డి, చాగంటి బావయ్య నిర్మిస్తున్నారు. సహనిర్మాతగా సత్తిరాజు చవుదరి, నిర్వాహకుడుగా పిండిప్రోలు రామారావు వ్యవహరిస్తారు.

## మూడు కథలపై చర్చ!

1976లో సూపర్‌హిట్ చిత్రాన్ని (ఆరాధన) నిర్మించిన పుండరీకాక్షయ్యగారిని, గిరి రోడ్డులోని వారి ఆఫీసులో కలిశాను. సాయంత్రం ఆరయితే చాలు ... భాస్కర చిత్ర ఆవరణం కవి...పండిత... రచయితలతో కలకలలాడుతుంటుంది.

నిర్మాత పుండరీకాక్షయ్యగారిని స్కాలర్ అని చెప్పొచ్చు. ఆయనకు అన్నీ తెలిసినా, ఏమీ తెలియనట్టు కనిపించడమే ఆయన సంస్కారం.

ప్రస్తుతం "నర ... నారాయణ" చిత్రాన్ని వర్క్ చేస్తున్నారా అని యీ విలేఖరి ప్రశ్నించాడు.

మూడు కథలపై చర్చ జరుపుతున్నాము. ఒకటి. "నరనారాయణ." రెండు "ఖయిన్ కథ." మూడు ఒక ఫ్యామిలీ సబ్జక్టు. అన్నారు పుండరీకాక్షయ్య.

ప్రతిరోజూ రెండుగంటలసేపు తను, గొల్లపూడి, తమ్ముడు బలరామ్‌గారు బీచ్‌కు వెళ్లి, కథలపై వాదోపవాదములు చేస్తున్నట్టు, పుండరీకాక్షయ్యగారు చెప్పారు.

## రెబల్‌స్టార్ తర్వాతి చిత్రం

పాత్రల ఎంపికలో ఎంత జాగ్రత్త వహిస్తారో, కథల సెలక్షన్‌లో కూడా అంత జాగర్త వహించడం కృష్ణంరాజుగారికి తెలుసు.

"కృష్ణవేణి ... కన్నప్ప" వంటి ఉత్తమశ్రేణి చిత్రాలను అందించిన కృష్ణంరాజు యీసారి మరో మంచి చిత్రాన్ని యిస్తారని ప్రేక్షకులు ఆశిస్తారు.

కొన్ని పత్రికలలో వచ్చిన "శాకుంతలం" వార్త నిజమేనా అని నేను ప్రశ్నించాను.

"శాకుంతలం" మాత్రం కాదు. ఒక మంచి కథను వ్రాయిస్తున్నాను. జనవరి నుంచి షూటింగు ప్రారంభించాలని ఆశ." అన్నారు రెబల్‌స్టార్.

'ముత్యాల పల్లకి'లో రాజబాబు, రమాప్రభ





'దేవుడే గెలిచాడు'లో విజయనిర్మల

### నిర్మల విజయమ్ !

ఆమె పట్టుదల, ఆమె కార్యదీక్ష, వర్కు పట్ల ఆమె చూపే శ్రద్ధ, ఆమె ఓపిక యెంతేని అభినందనీయం. వృత్తిని దైవంగా భావిస్తున్నది గాబట్టే, విజయనిర్మల ఉత్తమ దర్శకురాలు కాగలిగింది.

"దేవుడే గెలిచాడు" వర్ణ చిత్రాన్ని ఆమె యెంతో మనోహరంగా మలచిన విజాన్ని ఈ విలేఖరి కళ్లారా చూశాడు. స్పాట్ నిర్ణయాలు తీసుకునే ఆమె సమయస్ఫూర్తిని అభినందించాలి. "వాట్ షి థింక్స్ ... షిడస్." అందుకనే ఆమె వర్కులో కన్‌ఫ్యూజన్ కనిపించదు.

### కొత్త చిత్రాలు !

నిర్మాత నరసింహారెడ్డికి, నిర్వాహకుడు భాస్కరరావుకు "పసుపుతాడు" చిత్రాన్ని (డైరెక్షన్) చెయ్యడానికి విజయనిర్మల అంగీకరించింది. పూర్తి స్క్రిప్టు రెడీ అయితేనేగాని, ఆవిడ డైరెక్షన్ ముట్టుకోదు. "షి యీజ్ ఎ జీనియస్ యిన్‌డీడ్."

### అర్ధరాత్రికి రంభ ...ఊర్వశి...మేనక

"యవ్వనం కాటేసింది, మన్మథలీల" చిత్రాలను అందించిన నిర్మాత మాగంటి రవీంద్రనాథ్ చౌదరిగారు "అర్ధరాత్రి" సాంబశివరావుకు ఒక వినూత్నమైన చిత్రాన్ని అప్పగించారు.

చిత్రం పేరు "రంభ ... ఊర్వశి ... మేనక." ఈ చిత్రానికి సత్యానంద్ సంభాషణలను, చక్రవర్తి సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

### రెండు షెడ్యూల్సు !

"రంభ ... ఊర్వశి ... మేనక" చిత్రంలో మురళీమోహన్, నరసింహరాజా, రావుగోపాలరావు, రోజారమణి, హలం, జయమాలిని ముఖ్య పాత్రధారులు.

ఈ చిత్రం షూటింగు రెండు షెడ్యూల్సులో పూర్తి అవుతుంది, అన్నారు నిర్వాహకుడు, విజయ బాపినీడుగారు.

పి. సాంబశివరావుగారికి యిదొక చక్కని అవకాశం. మంచి రిజల్టు యివ్వగల సమర్థుడే.

### ఇషారా శిష్యుడికి తెలుగు చిత్ర దర్శకత్వం

బి. ఆర్. ఇషారా, వి. యస్. రెడ్డి లాంటి ప్రముఖుల వద్ద పాఠాలు నేర్చుకున్న ఒక యువకుడికి చిత్రభారతి ఇంటర్నేషనల్‌వారు తమ తెలుగు చిత్ర దర్శకత్వ బాధ్యతను అప్పగించారు. ఆ అభ్యుదయ దర్శకుని పేరు బి. మోహనరావు. బి. ఆర్. ఇషారాగారి "రాహుకేతు", వి. యస్. రెడ్డిగారి "జహరీలీ" చిత్రాలకు కథ, స్క్రీన్‌ప్లేను సమకూర్చి, వారికి అసోసియేట్‌గా పని చేసిన ఉత్సాహవంతుడే యీ మోహనరావు.

విజయవాడలోని చిత్రభారతి ఇంటర్నేషనల్ అనే పంపిణీ సంస్థకు సంబంధించిన వినయభూషణ్ వి. ఆర్. కె. గారి మద్దతుతో సి. హెచ్. యన్. రెడ్డి పై చిత్ర నిర్మాణ సంస్థను నెలకొల్పడం జరిగినట్టు, యీ చిత్రంలో భాగ్యనగరం ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన కొందరు వ్యక్తులను పరిచయం చేస్తున్నట్లు కథ, స్క్రీన్‌ప్లే, డైరెక్షన్ శాఖాధిపతి బి. మోహనరావు తెలియ చేసారు.

జయప్రకాష్, రంజిత్‌చంద్ర, చంద్రభూషణ్ అనే ముగ్గురు క్రొత్తవారితోబాటు రావుగోపాలరావు, దేవిక, విజయలలిత, అపర్ణ మున్నగు పాత తారలు కూడా పై చిత్రంలో నటిస్తారని నిర్మాత సి. హెచ్. యన్. రెడ్డి చెప్పారు.

### అరిషడ్ వర్గాల ఆధిపత్యం

మానవ జీవితంలో అరిషడ్ వర్గాల ఆధిపత్యం యెలా వుంటుంది ? వాటివల్ల జరిగే పరిణామాలు ఏమిటి ? అనే సమస్యపై చర్చనీయాంశంగా సాగిపోయే కథ మా చిత్రానికి మూలం అన్నారు మోహనరావు.

### బొంబాయిలో రికార్డింగ్

ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను, వంగ సంగీత దర్శకుడు సంగీతాన్ని సమకూర్చగలరని నిర్మాత చెప్పారు.

### సునీల్ చిత్రానికి దర్శకుడు ?

"బంగారక్క" చిత్రాన్ని అనుకున్న వ్యవధిలో పూర్తిచెయ్యడానికి, సహకరించిన సారథీ స్టుడియోస్ వారికి, నవయుగా వారికి రవి శంకర్ అధినేత కృతజ్ఞతలు తెలుపుతున్నారు. "బంగారక్క"ను డిశంబరులో విడుదలచేసే వుద్దేశ్యం సునీల్‌కు లేకపోలేదు. నవంబర్ మూడవ వారంలో ఫస్టు కాపీ వస్తుంది.

సారథీ స్టుడియోస్‌తో కలిసి సునీల్ చవుదరి ప్రారంభించే చిత్రానికి దర్శకుడెవరు అని పాఠకులకు తెలియాలిగా.

"అగ్రదర్శకుడు" అని ఆయన అన్నారు. కొత్తవాడా ? హిందీ దర్శకుడా ? పాతవాడా ? అని నేనడిగాను. మూడూకావు అన్నారాయన. ప్రేక్షకులకు పరిచితుడు...పాపులారిటీని పొందినవాడు అని సునీల్ చెప్పారు. ఎవరయ్యింటారో వూహించుకోండి !

— శ్రీనివాస్

'జన్మజన్మల బంధం'లో వాణిశ్రీ, కృష్ణ





# ఆడమనసు

ఉప్పలూరి ఉమాదేవి

**వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.**

**సంధ్యాసమయం. పక్షులు గూటికి చేరుకుంటున్నాయి.**

సిటీబస్‌లన్నీ రద్దీగా వున్నాయి. ఉదయం ఫ్రెష్‌గా వెళ్లినవారు అలసిపోయి, వాడిన ముఖంతో ఎపుడు యింటికి చేరుకుంటామా? అని చూస్తున్నారు.

"హల్లో! శ్రీధర్! ఎపుడొచ్చావ్?" ప్రదీప్ లోపలికొస్తూ అడిగాడు.

"ఫైవ్‌మినిట్స్ అయింది బావగారూ! అక్క లోపల కాఫీ తయారుచేస్తోంది." అన్నాడు.

"చిత్రా! కాఫీకి మేమూ రెడీ అయ్యాం. ఇంకో కప్పు తీసుకురా. ఆఁ శ్రీధర్! అంతా కులాసావా?" సావధానంగా కూర్చుంటూ అడిగాడు.

"అంతా కులాసానే, పద్మ డెలివరీ టైమ్ కదా! నిన్న రాజమండ్రి తీసుకొచ్చాను, ఎలాగూ లీవ్ పెట్టానుకదా! మిమ్మల్ని చూడొచ్చుని వచ్చాను."

ఇంతలో మూడేళ్ళ మున్ని వచ్చింది.

"అరె! ఎక్కడికెళ్ళావమ్మా?" ఆశ్చర్య పోతున్నట్లు అడిగాడు ప్రదీప్ మున్నిని ఒడిలో కూర్చోపెట్టుకుంటూ.

"మరే, డాడీ! అంకుల్ వత్తే మమ్మీ కాపీ చేత్తందిగా. అందుకని మమ్మీకి..." అంటూ ఎలా చెప్పాలో తెలియక ఆగిపోయింది.

"సాయం చేద్దామని వెళ్ళావామ్మా?" ముద్దు పెట్టుకుంటూ అడిగాడు.

'ఊఁ' అంటూ తల వూపింది.

"మరి అంకుల్‌తో మాట్లాడేవా?"

"ఆఁ! మతే అంటీకి బుజ్జిపాప పుడుతుందని అంకుల్ చెప్పారు. డాడీ! నాకు పాప కావాలి." అంది ప్రదీప్ గెడ్డం పుచ్చుకుని.

"మీ మమ్మీ నడుగు, నాదేంలేదు." అన్నాడు కాఫీ తీసుకువస్తున్న చిత్రని చూసి నవ్వుతూ.

"పాపం ఆశ!" అంది చిత్ర నవ్వుతూ.

"ఆంటీ మంచిది, పాప నిత్తోంది, నీతో మాట్లాడను." అంది బుంగమూతి పెడుతూ.

ముగ్గురూ గట్టిగా నవ్వేసారు.

"బాప్‌రే! మున్ని కోరిక తీర్చాల్సిందే చిత్రా!" అన్నాడు ప్రదీప్ నవ్వుతూ.

"బావగారూ! వెదర్ ఏం బాగుండలేదండీ!" అన్నాడు శ్రీధర్ విసుగ్గా.

"చాల బాగుంది నాకు. ఇటువంటప్పుడు భార్యామణితో కూర్చొని వేడి వేడి పకోడీలు తింటూ కబుర్లు చెప్పుకుంటుంటే ఎంత బాగుంటుందో చెప్పలేను." చిత్రవైపు చూసి అన్నాడు.

"ఏమోనండీ, వర్షం వస్తే ఏ పనీ జరగదు" అన్నాడు.

వర్షం చిరుజల్లుగా ప్రారంభమైంది.

*   *   *

అర్ధరాత్రి.

వర్షం కుండపోతగా కురుస్తోంది.

మెరుపులు పాముల్లా జారిపోతున్నాయి.

ఎపుడెపుడు ఒకటో అరో పిడుగులు పడుతున్నాయి.

సుచిత్ర నిద్రపోతోంది. ప్రదీప్ నెమ్మదిగా లేచి టేబుల్ దగ్గరకు వెళ్లి టేబుల్‌లైట్ వేసి లెటర్‌పాడ్ తీసి ఏదో వ్రాసి కవరులోపెట్టి దాచేసి లైట్ తీసి బెడ్ దగ్గరికి వచ్చాడు.

ఇంతలో చెళ చెళా మంటూ ఆకాశం ఘర్జించింది.

కెవ్వున అరిచింది సుచిత్ర. గుబుక్కున దగ్గరికి తీసుకున్నాడు. ఇంకా భయపడ్తోంది. పెదవులు అదురుతున్నాయి.

"చిత్రా! ఏయ్! కళ్లు తెరు." అన్నాడు నెమ్మదిగా.

కళ్లు తెరిచి చూసింది. భయంతో రెపరెప లాడుతున్నాయి.

మంచినీళ్లు తాగించాడు.

"నిద్దరొస్తోంది." అంది మత్తుగా.

"ఈసారి మళ్లీ కెవ్వుమంటూ లేవకు. శ్రీధర్, మున్నీ పరిగెత్తుకొస్తారు." అన్నాడు ఆమెవైపు తిరిగి పడుకుంటూ.

సుచిత్ర గట్టిగా గిచ్చింది.

ఈసారి కెవ్వుమనటం ప్రదీప్ వంతయింది.

* * *

ఉదయం ఏడు గంటలయింది.

ఆకాశంలో మబ్బులు యింకా విడిపోలేదు.

మేఘాలు మళ్లీ వర్షించేటట్లుగా వున్నాయి.

ప్రదీప్ బెడ్‌మీద పడుకునే వున్నాడు.

"గుడ్‌మార్నింగ్ డాడీ!" అంటూ మున్నీ వచ్చింది.

"గుడ్‌మార్నింగ్ బేబీ!" అంటూ మున్నీని ముద్దుపెట్టుకున్నాడు.

"మున్నీ! మీ డాడీని యిలా రమ్మను." అంటూ సుచిత్ర పిల్చింది.

"వస్తున్నాం మేడమ్! ఏమైనా వంట పని చెబుతారా?" కిచెన్ రూమ్‌లోకి వచ్చి అడిగాడు.

"ఆహా! చేసేవాళ్ళకైనా వుండదు." అంది పూరీలు వత్తుతూ.

"ఎందుకు పిలిచినట్లు?" చైర్‌లో కూర్చుంటూ అడిగాడు.

"కబుర్లు చెబుతారని." అంది.

'హాయ్' అంటూ ఆవలిస్తూ వచ్చాడు శ్రీధర్.

"శ్రీ! నీ కిష్టమైన పూరీ, కూరా చేస్తున్నాను." అంది నవ్వుతూ.

"అక్కా! ఫైవ్‌మినిట్స్‌లో వచ్చేస్తాను." అంటూ బాత్‌రూమ్ వైపు పరిగెత్తాడు.

"ఎంతైనా తమ్ముడు. నాలుగు సంవత్సరాల నుంచి కాపురం చేస్తున్నాం ఎపుడైనా ఏమండీ! మీ కిష్టమైంది చేసాను అని అన్నావా?" నవ్వు కన్పించనీయకుండా అడిగాడు.

"ఎందుకంటే అబద్ధాలు! ఇంకా ఆడపిల్లలు కావాలా?" చిరుకోపంగా అడిగింది చిత్ర.

"ఓయస్, కావాలి. ఏయ్! ఏమైనా..." అంటూ చిలిపిగా నవ్వుతూ ఆమె కళ్లలోకి చూసాడు.

"ఏయ్!" అంటూ నవ్వుతూ అప్పడాలకర్ర ఎత్తింది.

"బాప్‌రే! పత్రికలో కార్టూన్‌ని, నిజం చేయకు." భయం నటించాడు.

టిఫిన్ చేస్తుంటే చాకలి వచ్చాడు.

"అమ్మగోరూ! బట్టలెయ్యండి." అంటూ కూర్చున్నాడు.

"చిత్రా! నిన్న వేసుకున్న పాంటూ, షర్ట్ వేసెయ్!" అన్నాడు ప్రదీప్.

ప్రదీప్ పాంట్ జేబులో కవరు దొరికింది. లెటర్ వస్తే చెప్పేవారు. ఎక్కడనుంచా? అని చూసింది. ఫ్రం అడ్రస్‌లో 'అనుపమ' అని వ్రాసి వుంది.

"ఎవరీ అనుపమ?" ఆమె మనసు ఆలోచిస్తోంది.

"రండి, అమ్మగోరు! రేపుకెళ్తాం." అంటూ చాకలి గొడవ.

కవర్ని రేడియో క్రింద పెట్టి పాంట్ వేసింది.

పని చేస్తోందేకాని చిత్ర మనసంతా కవరు చుట్టూ తిరుగుతూనేవుంది.

"చిత్రా! వైట్ డ్రెస్ తియ్యమంటే బ్లూ తీసావేమిటి?" డ్రెస్ చేసుకుంటూ అడిగాడు.

"ఆదేగా మీరు తియ్యమంది." అంది.

"ఓహో! చెవుడొచ్చిందాండి!" నవ్వుతూ అడిగాడు.

"నాకేమీ రాలేదు, నాతో మాట్లాడవద్దు." అంది చిన్నపిల్లలా.

సుచిత్ర మనసు చాలా సున్నితం. ఒకళ్ళు చెప్పిందీ, తను చూసిందీ నిజమనుకుంటుంది. అందుకు కారణాలు ఆలోచించదు. కోపంవస్తే చాల కష్టం. కోపం రాకపోతే సుచిత్ర అంత మంచిమనిషి. ప్రేమస్వరూపిణి యీ లోకంలోనే వుండరు.

ఎటొచ్చీ అతివృష్టి, అనావృష్టికి తట్టుకో గలగాలి. ఆ నేర్పు ప్రదీప్‌లో వుంది. కోపం వచ్చినపుడు మున్నీకన్న చిన్నదన్పిస్తుంది సుచిత్ర అతనికి.

ఎందుకో కోపం వచ్చేసింది అనుకుని బ్లూ డ్రెస్సే వేసుకున్నాడు.

"బావగారూ! రెడీయేనా?" శ్రీధర్ అడిగాడు.

"ఆఁ! వస్తున్నాను." అంటూ రాత్రి దాచిన కవరు తీసుకున్నాడు.

రోజా చిత్ర, మున్నీ నుంచి ప్రెజెంట్ తీసుకోందే, తను యివ్వందే ప్రదీప్ బయటకు వెళ్లడు.

చిత్ర కోపం బాగా తెలుసు ప్రదీప్‌కి. అటువంటి సమయంలో దగ్గరికే రానివ్వదు.

మున్నీని ముద్దుపెట్టుకుని 'ఒకటి మిస్సింగ్' చిత్రకి వినపడేలా అని వెళ్లిపోయాడు.

జావా గేట్లోంచి 'రయ్' మంటూ వెళ్లింది.

పదింటికల్లా మున్నీకి భోజనంపెట్టి పడుకో పెట్టింది.

సుచిత్రకి ఒక గుణం వుంది. తనకి కోపం వచ్చినపుడు ప్రదీప్‌కి యిష్టమైనవన్నీ కట్టు కుంటుంది కాని దగ్గరకు రానివ్వదు. అతడు పడే వేదన చూసి బతిమాలించుకోవాలని ఆమె ఆరాటం.

లైట్ బ్లూ కలర్ వెంకటగిరి చీరకట్టి, తల నిండుగా మల్లెలు పెట్టుకుంది.

ఆ కవర్ని ఎపుడు తెరిచి చూద్దామా? అనే ఆత్రుత

ఎలాగైతేనేం కవర్ని తెరిచి లెటర్ తీసింది.

'డియర్ ప్రదీప్!'

నమస్తే! నువ్వు యిక్కడికివచ్చి రెండు నెలలయింది. మాధవి పరిస్థితిలో మార్పులేదు. ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూవుంటుంది, ఒక్కొక్కసారి గట్టిగా నవ్వుతుంది.

డాడీ యీరోజే వైజాగ్ తీసుకెళ్ళారు. ట్రంకాల్ వచ్చింది.

మెంటల్ షాకట. కొన్నిరోజులు అక్కడే వుండమన్నారుట.

'ప్చ్' మాధవి జీవితం ఎలా పరిభ్రమిస్తుందో! తలచుకుంటే బాధగావుంది.

ఒకసారి మనస్సుకి రిలీఫ్‌గా వుంటుందని పిక్చర్‌కి తీసుకువెళ్ళాను. మా ముందు వరసలో ఎవరో దంపతులు కూర్చొనివున్నారు. ఇక పిక్చర్ చూడకుండా వారివైపే చూస్తోంది.

ఒక్కసారిగా నవ్వేసింది.

నాకు భయంవేసి యింటికి తీసుకువచ్చేసాను.

మాధవి యిలా మారడానికి ఆనాటి సంఘటన కారణమనుకుంటాను. ఏమైనా మాధవీ తన ప్రేమను వ్యక్తంచేస్తే బాగుండేది.

ఇపుడు అనుకుని ఏం లాభం? చేయగలిగింది ఏముంది? అంతా విధి లిఖితం!

'పెళ్లికాని పెళ్లి'లో, హేమాచౌదరి



డాడీ అడిగినట్లు చెప్పమన్నారు. మరి వుంటాను.

నీ స్నేహితురాలు
అనుపమ.

ఒక్కసారిగా ఊపిరి పీల్చుకుంది సుచిత్ర.

ఏమిటి ఆ సంఘటన? ప్రదీప్ ఏమైనా యిదిగా ప్రవర్తించాడా? లేక ఆమె ప్రదీప్‌ని ప్రేమించిందా?

అమ్మో! ప్రదీప్ తన సొంతం. అతని మనసు తనదే, అతనిపై తనకే హక్కువుండాలి.

అయితే ప్రదీప్‌ని ప్రేమించివుంటుంది. అందుకే ఏ జంటవైపు చూసినా ఆమెకి కోపం. ఏమీ చేయలేని నిస్సహాయత ఏర్పడి నవ్వుకుంటోంది.

ప్రదీప్ నవ్వుగా, పొడవుకి తగ్గ లావుతో చూపరులకు అందంగా ఉంటాడు. దానికితోడు మాటలలో చొరవ, చిలిపిదనం ఎదుటివారిని ఆకర్షిస్తాయి.

ప్రదీప్ హృదయమంతా తానే నిండి ఉండాలి. యింకొకరికి స్థానం ఉండకూడదు. అది 'అసూయ' అనే అనుకోండి.

ఇలా ఆలోచిస్తోంది ఆమె మనస్సు.

రెండవ శనివారం అవటంవలన బ్యాంక్ నుంచి పన్నెండింటికే వచ్చేసాడు ప్రదీప్.

శ్రీధర్ ఊరెళ్లిపోయాడు.

మోటార్ బైక్ వరండాలో పెట్టి విజిల్ వేసుకుంటూ లోనికి వచ్చాడు.

అంతా నిశ్శబ్దంగా ఉంది. నెమ్మదిగా బెడ్ రూమ్‌లోకి తొంగిచూసాడు. సుచిత్ర ఏదో నవల చదువుకుంటున్నట్లుంది.

'ఓహో' యింకా కోపం పోలేదనుకుంటాను. లేకపోతే ఈపాటికి ఎదురు చూస్తూ ఉండేది' అనుకున్నాడు.

దగ్గరగా వెళ్లి 'సేవ్‌పించ్' అని గిచ్చబోయాడు.

గబుక్కున చెయ్యి తీసేసింది.

'సత్యభామ నయమనుకుంటాను' ఆమెకి వినపడేలా అని ముస్సి దగ్గర కూచున్నాడు.

"సాని యిపుడు లేవద్దు" అంది.

"నాతో మాట్లాడటానికి ఎవరూ లేరు, నేను లేపుతాను" ఉడికిస్తున్నాడు.

"ఎందుకు లేరు, మీరు కావాలనుకుంటే అనుపమ, గినుపమ, మాధవి, గీధవి చాలమంది ఉన్నారు" అంది కోపంగా.

"నాకు అక్కర్లేదు, నాకు గిచ్చితే కావాలి" కొంటెదనం కళ్లలో మెరుస్తుండగా అన్నాడు.

"నా పేరు గిచ్చిత కాదు" అంది అతనిమీద పుస్తకం విసురుతూ.

'ఓ యస్! నవ్వకుంటున్నాం' అంటూ పుస్తకం అందుకున్నాడు.

"ఇదిగోండి లెటర్" అందించింది.

"నువ్వెపుడు చూసావ్?" నెమ్మదిగా అడిగాడు.

"మీరు చెప్పకపోయినా తెలిసే విధంగానే తెలిసింది. అపర శ్రీరామచంద్రుడు" అంది కోపంగా.

"అందుకు సందేహమా?" నవ్వుతూ అన్నాడు.

"ఎందుకండీ? రాముడిమీద ఉన్న గౌరవం పోగొడతారు? మీలా రాముడు యింతమంది స్త్రీలతో తిరిగాడా?" అడిగింది.

"ఏమిటి చిత్రా! నువ్వంటున్నది?" కోపంగా అడిగాడు.

"లెటర్ చదివారుగా తెలియడంలేదా? మాధవికి పిచ్చెక్కడానికి కారకులెవరు? ఏమిటి ఆనాటి సంఘటన?" నిలదీసినట్లడిగింది.

"మాధవి సంగతా నువ్వు అడిగేది. నావలన తప్పు జరగనపుడు భయపడటందేనికి? నువ్వు అనుమానిస్తావని నాకు తెలుసు. నేను యింతటి హోదాలో ఉండటానికి కారణం మాధవి తండ్రి రంగనాథ్‌గారు. రికమెండేషన్‌లు, లంచాలు ఉన్నా, ఉద్యోగాలు రాని రోజుల్లో కేవలం నా ఫస్ట్‌క్లాస్ డిగ్రీకి ఈ ఉద్యోగం యిప్పించారాయన. అపుడపుడు వాళ్ళింటికి వెళ్తుండేవాడిని" –

'మాధవి వాళ్ళ అమ్మాయేనా?' మధ్యలో అడిగింది.

"ఆ యిద్దరు అమ్మాయిలు. పెద్దమ్మాయి అనుపమ, చిన్నమ్మాయి మాధవి. అనుపమకి భర్త లేడు. మాధవికి చిన్న వయసులో పోలియో వచ్చి కాలు పడిపోయింది. ఎంతో విరాశగ ఉండేవారిని నా మాటలతో సరదాగా నవ్వించి, మాట్లాడించేవాడిని. క్రమంగా నాతో బాగా చొరవగా మాట్లా-




డటం మొదలుపెట్టారు. మాధవి చూపులు ఎంతో ఆరాధనగా ఉండేవి.

అపుడపుడు అమ్మ దగ్గరికి వెళ్తూనుస్తూ ఉండేవాడిని. తిరిగివచ్చినపుడల్లా పెళ్లిచూపుల కెళ్లారండి? ఎంతో ఆత్రుతగా అడిగేది మాధవి. సమాధానంగా నవ్వేసి ఊరుకునేవాడిని. మాధవి నామీద మనసు పెంచుకుంటుందని నేనుఊహించలేదు.

నా భార్య అందంగా, ఏవంక లేకుండా ఉండాలని, అపుడపుడు చిలిపి కలహాలు సృష్టించేదిగా ఉండాలని కోరుకునేవాడ్ని" అంటూ చిత్రవైపు చూసాడు.

ఆమె అమాయకంగా మొహంపెట్టి అతను చెప్పేది వింటోంది.

"ఒకసారి ఊరు వెళ్ళినపుడు నా కలల సుందరిని చూసాను. ఎలాఅయినా సరే ఆ అమ్మాయినే చేసుకుంటానని అమ్మతో చెప్పివచ్చాను. అప్పట్నుంచి ప్రపంచమంతా నాకు ఎంతో అందంగా కన్పించేది, మాధవివాళ్ళతో ఎంతో ఉత్సాహంగా మాట్లాడేవాడిని. అమ్మ శుభలేఖలు వేయించమని లెటర్ వ్రాసింది. మొదటి శుభలేఖ రంగనాథ్‌గారికిద్దామని వెళ్ళాను. మాధవి మేడమీద వీల్‌చైర్‌లో కూర్చొని పత్రిక చదువుకుంటోంది. రంగనాథ్‌గారు హాలులో సోఫాలో కూర్చొని పేపర్ చదువుకుంటున్నారు. నేను శుభలేఖ యిచ్చి తప్పకుండా రావాలని చెప్పాను..."

"మరి రాలేదనుకుంటాను." అంది.

"అదే, మాధవి ఎందుకనో రాలేదు. అనుపమ ఎక్కడికీ రాదు. రంగనాథ్‌గారికి తీరికే వుండదు. 'చాలా సంతోషమోయ్! ఒక యింటివాడివవుతున్నావు' అన్నారు. నవ్వుతూ, మాధవితో చెప్పారీ విషయం.

'ఏమిటి డాడీ?' అంటూ ముందుకు రాబోయి వీల్‌చైర్‌లో నుంచి దొర్లుకుంటూ క్రిందికి పడిపోయింది. ప్రక్కనే వున్న అనుపమ గ్రహించేలోపునే యిదంతా జరిగిపోయిందిట. అదే ఆనాటి సంఘటన. అన్నీ సరిగా వున్నవారికే పెళ్లి జరగటం అలస్యమవుతున్న యీ రోజుల్లో కుంటితనం, పిచ్చి కల యువతిని ఎవడు చేసుకుంటాడు? ఆదర్శాలు వల్లించడం తేలిక. ఆచరణ అసాధ్యం. నిన్ననే అనుపమ దగ్గర్నుంచి లెటర్ వచ్చింది. నేను రెండు నెలల క్రిందట అమ్మని చూడటానికి వెళ్లినపుడు అక్కడికికూడా వెళ్లాను. ఇదంతా నీకు నిన్ననే చెప్పవచ్చు. లేక పెళ్లయిన కొత్తలో చెప్పవచ్చుకాని ఆడమనసు ఎటువంటిదో నాకు తెలుసు. అసూయ ముందుపుట్టి ఆడది తర్వాత పుట్టిందంటారు." అన్నాడు.

"మగవాళ్లకీ వుంది అసూయ. భార్య ఇంకో మగాడితో మాట్లాడితే అసూయ, అనుమానం!" అంది కోపంగా.

"అరె, మాలోనూ అసూయాపరులున్నారని ఒప్పుకుంటాను మేడమ్! మాధవి మూగగా ప్రేమించింది. తన ప్రేమను బయటపెట్టలేదు."

"పెట్టివుంటే ఆమెనే వరించేవారా?" అడిగింది.

"అదిగో, అదే అసూయ. ఆడమనసు ఇంతే. ఏదో చూస్తారు, ఏదో వింటారు, నమ్మేస్తారు. భర్తపై కోపం తెచ్చుకుని యింటిని అశాంతిపాలు చేస్తారు. ఇపుడు నువ్వు ఆలోచించింది అంతే." అన్నాడు.

"మీరు మాధవిని చేసుకుంటే పోయేది." అంది బుంగమూతి పెడుతూ.

"మేడమ్! నేను సామాన్య యువకుడ్ని. ఆదర్శవాదిని కాదు. నాతో లక్షణంగా తిరిగే భార్య కావాలని కోరుకున్నాను. ఆదర్శం అనే మేలి ముసుగు వేసికొని అమాయక యువతులను మోసంచేసి పెళ్లి చేసుకుని, మోజు తీరిన తర్వాత, అందరూ భార్యలతో సరదాగా తిరుగుతుంటే 'ఛీ' నీతో యింతే ఎక్కడి కెళ్దామన్నా లేదు. అని విసుక్కునే ఆదర్శవాదులని చాలమందిని చూసాను. ఇంకేముంది ఏడ్పులు, పెడబొబ్బలు ఐ హేటిట్!" అన్నాడు ప్రదీప్.

"అందుకే మీ మగాళ్ళు ఆడమనసు లెరిగి ప్రవర్తించండి!" నవ్వుతూ.

"చిత్రా! ఆకలి!" అన్నాడు.

"పదండి సార్! అలిసిపోయారు." అంది చిత్ర కుర్చీలోంచి లేస్తూ. ●

దూరపు కొండల్ని చుట్టుకున్న నీలిమబ్బులు
నిశ్చలమైన కొలనులోకి వాలిన
ఆకాశపుటంచు ప్రతిబింబం
కోర్కెతో పురివిప్పి నర్తించే నెమలి
ప్రియురాలి జడలో అల్లరిగా చిలిపిగా తొంగిచూసే నీలాంబరాలు
గుడిచెంత చెరువులో గాలికి వయ్యారంగా
తలలూపే నీలి కలువలు
వెన్నెల్లో హృదయస్పందనాల్లాగ
ఒడ్డును తాకే సముద్ర కెరటాలు
అనంతం
ఆశ
స్వేచ్ఛ






నీలి రంగులోని అనేక ఛాయలు

నెరొలాక్

GNA-102

# 3 నెలలప్పుడు పాపకు యిచ్చే ఘన ఆహారం మిగతా జీవితపు స్వరూపాన్ని నిర్ణయిస్తుంది;
## కేవలం పాలుయిస్తే చాలదని డాక్టర్ల అభిప్రాయం



డాక్టర్లు సిఫార్సు చేస్తారు

# ఫారెక్స్®

**సంతులిత ఘన ఆహారం**
**త్వరగా సంపూర్ణమైన పెరుగుదలకోసం**



పాపకు 3 నెలలు వచ్చాయంటే, పెరిగే సమయం మొదలైందన్న మాట.
పాప శరీరమూ దానితో బాటే మెదడూ పెరగటం ప్రారంభిస్తాయి. అప్పుడు పాలు మాత్రమే యిస్తే చాలదు, అసలు తల్లి పాల నుంచి మార్చే యీ సమయమే ఎదుగుదల సమయం. సున్నితమైన పాప జీర్ణకోశానికి యింట్లో అందరూ తినే ఆహారాన్ని తిని అరిగించుకునేలాగ చెయ్యాలి. దానికి ఫారెక్స్ యివ్వడం కన్న మించినదిలేదు.

**డాక్టర్లు ఫారెక్స్ యివ్వమని సిఫార్సుచేసే కారణం—**
పెరిగే పాప అవసరాలకు కావలసినది దీనిలో ప్రత్యేకంగా సంతులితం చేయబడటం.
ఫారెక్స్‌లో, ఆరోగ్యమైన రక్తమూ, శక్తినీ యిచ్చే యినుము సరియైన ప్రమాణంలో ఉంది— తల్లి పాల నుంచి మార్చేటప్పుడు యిచ్చే ఏ యితర ఆహారంలోనూ యిది యింత సరియైన పద్ధతిలో సంతులితం చేయబడలేదు.
ఫారెక్స్‌లో గల కాల్షియం, విటమిన్ డి2 పాపకు పటిష్ఠమైన ఎముకలూ, గట్టిపళ్ళూ సమకూరుస్తాయి. సరియైన ప్రమాణంలో గల ప్రొటీన్లు, మెదడునూ, శరీరాన్ని త్వరిత గతిలో పెరిగేలా చేస్తాయి. పాప అవసరాలకు కావలసిన శక్తి యిస్తుంది. అందుకే తల్లులు మిగతా వాటికన్న ఫారెక్స్‌నే ఎంచుకుని యిస్తున్నారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

**ఫారెక్స్, తల్లి పాలనుంచి మార్చే సమయంలోని ఆదర్శ ఆహారం**
వివిధ రకాల ఆహారాలతో కలిపినప్పుడు రుచిగా ఉండేది ఒక్క ఫారెక్స్ మాత్రమే. పళ్ళు, కూరగాయలు, పప్పు, మాంసం, గుడ్లు లాంటి అవసరమైన ఆహార పదార్థాలను ఫారెక్స్‌తో కలిపి పాపకు అలవాటు చేయవచ్చును. మీ పాప వీటిని రుచిగా, యింట్లో అందరితో బాటు యిష్టంగా తింటుంది.

**ఫారెక్స్ పుస్తకం కోసం, రూ. 2 తగ్గింపు పథకం కోసం రాయండి...**
మీపేరు, విలాసం (ఏ భాషలో పుస్తకం కావాలో రాయండి), దానితో బాటు 25 పై. స్టాంపులు, పోస్ట్ బ్యాగ్ 19119, బొంబాయి 400 025కి రాయండి.




LIL.GF.53-934 TL

అమ్మా అమ్మా - నాకు ఉద్యోగానికి ఇంటర్వ్యూ కార్డు వచ్చిందే !

ఇంటర్వ్యూ కార్డు వచ్చిందమ్మా....

ఇంటర్వ్యూ కార్డు వచ్చింది ఎందుకూ....

రాగతి పండరి

## మోసపు వరుడు !

ఇతేషియా నుంచి 30 ఏళ్ళ గణపతి అయ్యర్ అనే సుగుణవంతుడు మద్రాసువచ్చిరూ, రూంవున్న పాంచిహోటళ్ళల్లో వుంటూ తాను పెళ్ళికానివాడి ననీ, తనకు నచ్చినవమ్మాయిని పెళ్ళాడాలనివున్నట్టు చెప్పి అశోకనగరులో రాణిఅనేఅమ్మాయిని పెళ్ళి చేసుకుని, ఆమెవద్దనుంచి ఏడువేలు విలువ చేసే నమ్మలు, ముక్కుపుడకలు ఎత్తుకుపోయి మైలాపూరులోని వో వడ్డీషాపులో తాకట్టుపెట్ట బోతూ పోలీసులకు చిక్కాడట. అతని చరిత్రంతా లాగితే అతనికి యిదివరకురెండు పెళ్ళిళ్ళు అయినట్టు అయిదేళ్ళ పిల్లకూడా ఉన్నటు తేలిందట. అంతేకా యితను మరో ముగ్గురమ్మాయిల పెళ్ళిళ్ళకి మూడు ముహూర్తాలు కూడా పెట్టించుకునేగా ఉన్నాడట. అరి పాపాత్ముడా !

## దొంగకోసం ప్రకటన!

లండన్‌లోని వో రేడియో షాపులో ఎవరో వో రేడియో దొంగిలించారట. దానికి షాపువారు "రేడియో దొంగిలించిన వ రెవరో దానికి సంబంధించిన యితర సామగ్రి కూడా దయచేసి తీసుకువెళ్ళవచ్చు. అవి మాకు నిరుపయోగము' అని ప్రకటించారట.

## ఆడుకుంటున్న బాలుని హత్య?

తిరుచూరుకు చెందిన వో వూరిలో 13 ఏళ్ళ జార్జి అనే కుర్రాడు రోడ్డు మీద తన స్నేహితులతో ఆడుకుంటుండగా ఎవరో వో యువకుడు హఠాత్తుగా పరుగున వచ్చి అతని మీదపడి కత్తి తో పొడిచి చంపేశాడట. ఇతన్ని పోలీసులు పట్టుకు అరెస్టు చేశారుగానీ అసలు ఆ కుర్రాణ్ణి ఎందుకు చంపాడో మాత్రం బోధపడలేదట!

## రోజుకి రెండున్న రేళ్ళు !

సైప్రస్‌లోని ఆర్చిబిషప్ మకారియోస్‌ని ప్రోసిడాని 1974లో నికోలాస్ శాంప్సన్ అనే ఆయన వో ఎనిమిది రోజులపాటే నియంతగా రాజ్యం చేశాడట. ఆనేరానికి యిప్పుడు ఇరవై సంవత్సరాల శిక్ష పడ్డదట. రోజుకు రెండు న్నరేళ్ళు! ఫెంటాస్టిక్

## పాశ్చాత్య డైరీ

## బంగారు బొజ్జ !

కుట్టిపురం అనే వూరికి చెందిన వో వ్యాపారి మీద కస్టమ్సు శాఖవారు విరుచుకుపడినప్పుడు అతని రెండు కళ్ళలో వెదికినా ఏమీ కనబడలేదట. దాంతో అతని పొట్టమీద కన్నేసి, అనుమానం వుండి ఎక్స్‌రే కన్నేసిచూస్తే పొట్టలో అయినింపుగా 52 గ్రాముల బంగారం దాచుకున్నట్లైనం బయట పడిందట— అనకేం జరిగింది! ఏముంది! కష్టం చేసి కడిగేసు తూలా గొట్టాను.

## మగపిల్లాడు కావాలా !

పిల్లల్ని కనడంలో ఆడవాళ్ళో, మగవాళ్ళో నిర్ణయించుకుని అదేరకంగా కనవచ్చునని ఇంద్రజిత్ కపూర్ అనే వో పెద్దమనిషి నిరూపించారట. స్త్రీ బహిష్టు అయిన నాలుగు ప్రతిరోజూ పొద్దున్నే లేవగానే థర్మామీటరుతో టెంపరేచరు చూస్తూండాలట టెంపరేచర్ పెరిగిననాడు భర్త ఆమెతో కలిస్తే ఆడపిల్లనీ, అలాగాక, టెంపరేచరు పెరిగిన రెండో రోజున గనుక కలిస్తే మగపిల్లాడని ఆయనకేటూ యింత చెప్పారట అట్లాచేయుడు.

## మంచికిపోతే ఎదురైన మృత్యువు !

కణకం పాండియంకు చెందిన 50 ఏళ్ళసింగోడ గవుండరనే ఆయన స్నేహితుడు రామన్ అనే ఆయనో కేసులో యిరుక్కుంటే సింగోడ గవుండరు ఏడొందల రూపాయల వరకూ ఖర్చు చేశాడట. ఆ డబ్బు తిరిగి యిచ్చెయ్యమని గవుండరు రామన్ను అస్తమానూ అడుగుతూండడం వల్ల కోపంలో రామన్ వో బండరాయిపెట్టి సింగోడ గవుండరు తలచితకేసి చంపేశాడట.

## మూడువందల పాకలని చుట్టబెట్టిన చుట్టపీక

విశాఖపట్టణానికి చెందిన రామారావు అనే వో విలాసుడు పూటుగాతాగి తూలుకుంటూ చుట్ట కాలుస్తూ కొబ్బరితోటలో పోటూ, పోతూ నోట్లో చుట్టను విసిరిపారేశాడట. ఆ పీక వో పాకమీద పడి, ఆ పాకేగాక మరోరెండువందల తొంభై తొమ్మిది పాకలను దగ్ధం చేసిందట. చుట్టకువాడుగా వైకం!

## హత్యకి దారితీసిన అక్రమ సంబంధం

కోయంబత్తూరు జిల్లాకు చెందిన మురుగన్ పుదూరుకు చెందిన చెన్నయ్యప్పన్ అనే అతనికీ, అతని అన్నగారి భార్య 30 ఏళ్ళ అరసమ్మాల్‌కూ రహస్య అక్రమసంబంధం వుందట. అయితే అరస మ్మాల్ యీ సంబంధం మరదితోనే పరిమితం చేయక, వూరిలో మరికొంత మందికి కూడా కలిగించిందట. ఈ విషయం తెలిసిచెన్నయ్యప్పన్ ఆమెను కొప్పడ్డాడట. దాంతో అరసమ్మాల్ "నీ వెంటో నాకంతా అంతే. అవ్వళవుడనే" అందట. ఈ సమాధానానికి ఒళ్ళుమండిన చెన్నయ్యప్పన్ వెదురు నరికే కత్తితో ఆమెతల, మొండెము వేరు చేసేశాడట ఒకే దెబ్బకు.

చెప్పులు తెమ్మని గోల పెట్టావుగా! షాపుదగ్గర నీ సైజు అమ్మాయి కనబడింది. షాపులోకి రమ్మని పిలిచాను. వాళ్ళాయన పరుగెత్తు కొచ్చాడు.

కరూరి

# టెలిరాడ్ నుంచి ఉత్సవ కాలమున శుభాకాంక్షలు!

## భారతదేశపు అతి విశిష్టమైన రేడియోల శ్రేణిని తయారుచేయువారు.

**ఆర్‌పి 102**

మీడియమ్ వేవ్, పాకెట్ ట్రాన్సిస్టర్, అతి సూక్ష్మ ధ్వని గ్రాహిణి. కేవలము 2 పెన్‌లైట్ సెల్స్ మీద పని చేస్తుంది—రూ. 85



**ఆర్‌పి 213**

చిన్నది, కాని శక్తివంతమైనది, అందమైన మెటల్ గ్రిల్‌గల 2 బ్యాండ్ల పోర్టబుల్. మీడియమ్ మరియు 16 మీ.—60 మీ. వరకు పూర్తిగా షార్ట్ వేవ్‌ను అందుకొనును. 3 పెద్ద సెల్స్ మీద పని చేస్తుంది—రూ. 185.



**ఆర్‌పి 222**

2 బ్యాండ్ల పోర్టబుల్. షార్ట్ వేవ్‌ను 19 మీ. నుంచి 60 మీ. వరకు అందుకొనును, అందమైన మెటల్ గ్రిల్. 3 మీడియమ్ సైజ్ సెల్స్ మీద పని చేస్తుంది—రూ. 150.



**ఆర్‌టి 216**

సాటి లేని 2 బ్యాండ్ల పోర్టబుల్. 4 మీడియమ్ సెల్స్ మీద పని చేస్తుంది—రూ. 165.



**ఆర్‌పి 220 జిఎమ్**

2 బ్యాండ్ల పోర్టబుల్, పూర్తి మీడియమ్ వేవ్ మరియు 16 మీ. నుంచి 60 మీ. వరకు షార్ట్ వేవ్‌ను అందుకొనును. 4 పెద్ద సెల్స్ లేక తిన్నగా ఏసి మెయిన్స్ మీద పని చేస్తుంది—రూ. 220.



**ఆర్‌పి 223**

అందమైన 2 బ్యాండ్ల పోర్టబుల్, 'వర్టికల్' డయల్ కలది. పుష్-ఇన్ హ్యాండిల్ గల క్యాబినెట్. 16 మీ. నుంచి 60 మీ. వరకు షార్ట్ వేవ్‌ను అందుకొనును. 3 పెద్ద సెల్స్ మీద పనిచేస్తుంది—రూ. 165.



**ఆర్‌పి 322**

3 బ్యాండ్ల పోర్టబుల్ ట్రాన్స్‌మెయిన్స్. హై-లో టోన్ మరియు ఫైన్ ట్యూనింగ్ కంట్రోల్స్. 4 పెద్ద సెల్స్ మీద గాని ఏసి మెయిన్స్ మీద గాని పని చేస్తుంది—రూ. 330.



**ఆర్‌టి 302 డీలక్స్**

3 బ్యాండ్ల ఏసి మెయిన్స్ రేడియో. నిరంతరము టోన్ కంట్రోల్, అందమైన పోలియెస్టర్ ఫినిష్ క్యాబినెట్. ఎక్స్‌టెన్షన్ స్పీకర్ మరియు ఫోనో పిక్-అప్ కోసం సాకెట్లు—రూ. 410.



**ఆర్‌టి 423 ఎస్**

4 బ్యాండ్ల మెయిన్స్ రేడియో. పిక్-అప్ మరియు టేప్ రికార్డర్ కోసం సాకెట్లు. పియానో కీ స్విచ్‌లతో స్పేస్-ఏజ్ డిజైన్ గలది—రూ. 675.





టిసి 5037



టిడి 3171



ఎపి 02



ఎఆర్ 30

అన్ని వెలల నుండి ఎక్సయిజ్ మరియు స్థానిక పన్నులు మినహాయింపబడినవి.

**TELERAD**

సారాభాయ్ ఎలక్ట్రానిక్ రీసెర్చ్ సెంటర్ వారి సాంకేతిక విజ్ఞానంతో రూపొందినది.

Shilpi TR-17A/76 Tel.

పట్టుకొని నాశనం చేయడం ఈ శాఖ చరిత్రలోనే గొప్పసంగతి. మహబూబ్‌నగర్ జిల్లా అచ్చంపేట కొల్లాపురం తాలూకాలో దట్టమైన అడవుల మధ్యన ఉన్న ఈ గంజాయి చేలను కనుగొని ధ్వంసం చేసిన అడవుల చీఫ్ కన్జర్వేటర్ శ్రీ ఎ. కె. ఎహాదుర్‌మ, ఆయన సిబ్బందిని అభినందించక తప్పదు.

## శ్రీ డాక్టర్ హరినారాయణ్ సూచన

డాక్టర్ భగవంతం షష్ట్యబ్ద పూర్తి సందర్భంగా అక్టోబరు 16 న ఏర్పాటయిన ప్రసంగ పరంపరలో జాతీయ భూభౌతిక పరిశోధన సంస్థ డైరెక్టర్ డాక్టర్ హరినారాయన్ ప్రసంగించిన సందర్భంలో భారతదేశం వంటి వర్ధమాన దేశాలలో శాస్త్రసాంకేతిక రంగాలలో కలిగిన అభివృద్ధితో పాటు జన సమస్యను, జనాభా సమస్యను పరిష్కరించుకోవాలన్నారు. "జనన మరణ చక్రంలో మూడు దశలుంటాయి. మొదటి దశలో మరణాల సంఖ్య క్రమంగా తగ్గుతుంది జననాల సంఖ్య ఇప్పటిలాగే వుంటుంది. రెండవ దశలో మరణాల సంఖ్య స్థిరపడుతుంది. జననాల సంఖ్య తగ్గుతుంది. మూడవ దశలో చాలమంది వృద్ధాప్యం పొందుతారు కనుక మరణాల సంఖ్య కొద్దిగా పెరిగి, జననాల సంఖ్య స్థిరపడుతుంది.

# హైదరాబాద్ నోట్‌బుక్

(18 వ పేజీ తరువాయి)

జనన మరణ చక్రంలో ఈ మూడు దశలతర్వాతే జనసంఖ్య అదుపులోకి వస్తుంది. అన్నారు ఆయన

## బ్రిడ్జి క్రీడాకారుని వివాహం :

సుప్రసిద్ధ బ్రిడ్జి క్రీడా నిపుణుడు, యూనియన్ ఇండస్ట్రీస్ సేల్స్ ఇంజనీర్ శ్రీ కె. వి. కృష్ణమూర్తికి, విశాఖ వాస్తవ్యులు, రిటైర్డ్ ఇంజనీరు శ్రీ పి. కృష్ణమూర్తి కుమార్తె సౌభాగ్యవతి సత్య కుమారికి వివాహం కాచిగూడలోని తుల్జాభవన్‌లో అక్టోబర 7వ తేదీన వివాహం వైభవోపేతంగా జరిగింది. 8వ తేదీన హైదర్‌గూడలోని కవాల్ మంజిల్‌లో విందు జరిగింది. శ్రీయుతులు మలాని పురుషోత్తమ్‌పిట్టీ, ముర్తుజా భాద్రా మొదలైన క్రీడానిపుణులు విద్వత్కవులు పారిశ్రామిక నేతలు వివాహానికి వచ్చారు. శ్రీ కృష్ణమూర్తి సుప్రసిద్ధ విద్వత్కవి శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి రెండవకుమారుడు. అక్టోబర్ 14 వ తేదీన శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి తమ సోదరుడు కీ.శే. రామనాథంగారి పుత్రిక సౌభాగ్యవతి రమాదేవిని, ధర్మపురివాస్తవ్యులు వేదశ్రౌత విద్వాంసులు శ్రీ బుగ్గవరపు వరహరిశాస్త్రి తృతీయ కుమారుడు మృత్యుంజయశర్మకిచ్చి బాలాజీభవన్‌లో వైభవోపేతంగా వివాహమహోత్సవం జరిపారు. పలువురు కవిపండితులు, ప్రముఖులువచ్చి వధూవరులకు శుభాశీస్సులిచ్చారు.

## శ్రీ తాపీ ధర్మారావు సాహిత్యోత్సవం :

సెప్టెంబరు 27 న భారతి గుణవర్ధక్ సంస్థ శ్రీ తాపీ ధర్మారావు సాహిత్యోత్సవం శ్రీ చింతపట్ల సుదర్శన్ అధ్యక్షతన జరిగింది. శ్రీ ధర్మారావుగారు సాహిత్యానికి చేసినసేవను, ఆయన భావాలలో క్రమంగా కలిగిన మార్పు సాహిత్యానికి, దేశానికి ఉపయోగపడినతీరును శ్రీయుతులు ఏటుకూరి ప్రసాదు, కే. వి. సుందరాచార్యులు, ఎస్. గోపీ, ఆర్వీ రామారావు, ఎస్వీ సత్యనారాయణ, గజ్జల మల్లారెడ్డి మొదలైనవారు వివరించారు. డాక్టర్ సోహన్‌సింగ్ ధర్మారావుగారి పేర ఒక ఉచిత చికిత్సాలయం నిర్వహిస్తున్నారు.

## శ్రీ జి. రంగారెడ్డి చిత్రాలు :

స్వయం కృషితో చిత్రకళ అభ్యసించి, తర్వాత సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ వి. మధుసూదనరావు వద్ద లలితకళ అకాడెమీ స్కాలర్‌షిప్పుతో ప్రత్యేక కృషి సలిపిన యువచిత్రకారుడు శ్రీ జి. రంగారెడ్డి ఇంతవరకు ఐదువ్యష్టి, సమిష్టి ప్రదర్శనల

జరిపారు. బహుమతులు పొందారు. ఈ సారి కళా భవన్‌లో అక్టోబర్ 8వ తేదీ నుండి 14వ తేదీ వరకు "మాంత్రికులు" అనే విషయంపై వ్యక్తి చిత్రప్రదర్శనం జరిపారు. దీనిలో 14 తైల వర్ణ చిత్రాలున్నాయి. శ్రీ వి. మధుసూదనరావు అన్నట్టు రంగారెడ్డి చిత్రాలు సహజమైనవి, స్వీయ మార్గంలో రచితమైనవి. మాంత్రికుల సహజ స్వభావం, ప్రవృత్తి, ప్రపంచాన్ని ఉగ్రంగా గెలుపుదామనే ఉత్కంఠ ఈ చిత్రాలలో కనిపిస్తాయి. మనను చిత్రకారునితోపాటు ఊహా లోకానికి తీసుకుపోతాయి. రంగారెడ్డి జానపద శైలీమిశ్రిత నిరూపకరణ (డిస్టార్షన్) పద్ధతిని దీనిలో అనుసరించడంవల్ల మాంత్రికుల కృత్రిమత మనకుస్పష్టమవుతుంది. ఏడుగురు మాంత్రికులు చిత్రంలో అంగాంగ సమన్వయం, హిప్నాటిజం ఆరెంజి ఈవెనింగ్ చిత్రాలలో వర్ణసమ్మేళనం, ఆకర్షణీయంగా ఉన్నాయి. రాష్ట్ర లలిత కళా అకాడెమీ కార్యదర్శి శ్రీ పి. టి. రెడ్డి ఈ ప్రదర్శనాన్ని ప్రారంభించారు.

### మాంత్రికరాజు



చిత్రకారుడు : శ్రీ బి. రంగారెడ్డి అక్టోబర్ 8 నుంచి 14 తేదీవరకు కళాభవన్‌లో జరిగిన ప్రదర్శనలోని చిత్రం.

**ఉపశ్రుతి.—**

"రాష్ట్రపరిపాలనలో అంచెలవారీగా తెలుగు వస్తుందన్నారు. అంగ్రేజీ అక్కరలేదన్నారు. మరి బాలల అకాడెమీస్థాపననాడు నాయకులంతా అంగ్రేజీలోనే ఉపన్యాసాలు ఇచ్చారేమండీ?" అనడిగాడు ఒక పల్లెటూరిపెద్దమనిషి. "బాగుందయ్యా ఎరసం. అంతాతెలుగులోనే జరిగితే రాష్ట్రపతికి, తక్కిన ఇతర రాష్ట్రాలవారికి అర్థంకావద్దా మన గోడు?' అని చిదరించుకొన్నాడు ఒక పట్నం పెద్దమనిషి.




*(గత సంచిక తరువాయి)*

ఆ రోజు ఆదివారం. "ఏమండీ ఏదైనా సినిమాకు వెడదామా?" అనడిగింది భర్తను ఇందిర.

"అబ్బ! వారమంతా ఎవరిపనులతో వాళ్ళుంటాము. ఈరోజైనా ప్రశాంతంగా ఇంట్లో కూర్చుందాము."

"ఔను! ప్రతిరోజూ పగలంతా అక్కడ పనితో సరిపోతుంది. ఇంటికొస్తే వీళ్ళ ఎత్తిపొడుపులతో సరిపోతుంది. ఆదివారమైనా కాస్త రిలీఫ్ వుంటుందని అడిగేను" అంది దిగులుగా.

ఆమెను చూసిన రమేష్ "అయితే బయల్దేరు అలా మూర్తిగారింటికి వెళ్ళివద్దాము" అన్నాడు.

ఒక అరగంటయినా ప్రశాంతత వుంటుందని బయల్దేరింది.

వాళ్ళలా వెళ్ళగానే పరంధామయ్య వచ్చేడు 'అక్కయ్యా బాగున్నావా?' అంటూ.

"ఆఁ ఇంట్లో అంతా కులాసాయేనా? శారదకేమైనా సంబంధాలు చూస్తున్నావా?" కుశల ప్రశ్నలు ప్రారంభించింది కామాక్షమ్మ.

"ఏం చూడ్డం. దైవఘటన ఎప్పటికుందో. ఎవరూ లేరా? బావేరి? కొడుకు, కోడలు ఏరి? ఈవేళ ఆదివారమేగా" అడిగేడు. ఇంట్లోకి కలయజూస్తూ.

బావలా బయటికెళ్ళేరు. వాళ్ళిద్దరు స్నేహితుల ఇంటికో, సినిమాకో వెళ్ళారు.

"ఔను కాని, ఉద్యోగస్తురాలు చెప్పిన మాటేమైనా వింటుందా? ఆడదానికి అణకువే అందం" అన్నాడు రహస్యంగా.

పుండుమీద కారం జల్లినట్టుగా అయ్యింది కామాక్షమ్మకు. "ఏం వినడంలేదూ! ఏదో చేసుకున్నాడు వాడి కిష్టమైంది. చాల పొగరుమోతు. ఒక్కమాట నాతో మాట్లాడదు. అత్తగారు అన్న గౌరవం ఏమాత్రం లేదు."

పరంధామయ్య మనస్సు ఉరకలు వేసింది. "అక్కయ్యా! నిజం చెప్తున్నా. మా శారద ఉందే ఎంత పనిమంతురాలనుకున్నావ్. దానికి ఎదిరించడమంటే ఏమిటో తెలియదనుకో. ఎంత నెమ్మది. అది పెళ్ళయి అత్తవారింటికెళ్ళిపోతే ఎలాగ అని వాళ్ళమ్మ బెంగపెట్టుకుంది" అన్నాడు. ఇంతలో రాఘవయ్యగారు కూడ రావడంతో కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడి వెళ్ళిపోయాడు.

* * *

మూర్తి డాబా మీద పిల్లలను ఆడిస్తున్నాడు. అతని భార్య కమల కుర్చీలో కూర్చుని ఏదో నవల చదువుకుంటోంది. కామేశ్వరమ్మగారు వంట యింట్లో ఉంది. సతీసమేతంగా వచ్చిన రమేష్‌ను చూసి మూర్తి కిందకు వచ్చాడు. ఇందిర నిరాడంబరము, ముగ్ధ మనోహరమైన ఆ రూపము చూసి కామేశ్వరమ్మగారు ఆనంద పడింది. వాళ్లకు కాఫీ కలిపిచ్చి మళ్ళీ తన పనిలోకి వెళ్ళిపోయింది. ఆఫీసు విషయాలు మాట్లాడుకుంటూ రమేష్ మూర్తితో డాబా మెట్లెక్కాడు.

> *జరిగిన కథ 1:* లాయరు శ్రీనివాసరావుగారి కూతురు ఇందిరకు రమేష్‌తో పెళ్ళవుతుంది. కోడలు ఇందిర ఉద్యోగం చేయటం ఇష్టం వుండదు కామాక్షమ్మకి.

'మనం ఇక్కడ కూర్చుందాం రండి' అని ఇందిరను అత్తగారి దగ్గరకు తీసుకువచ్చింది కమల.

'మీరు బి. ఏ. ప్యాసైనారు కదా! ఏదైనా జాబ్ చేయాలని లేదా?' అని సంభాషణ ప్రారంభించింది ఇందిర.

"నాకుద్యోగంమీద అంత యింటరెస్ట్ లేదు. సుఖాన్ని ఉన్న ప్రాణం దుఃఖాన్ని పెట్టుకోవటం. చాలా భాగం ఇంట్లోనే కాలక్షేపం అయిపోతుంది. ఒళ్ళు వంగితే అత్తయ్యగార్కి వంటలో సహాయం చేస్తాను లేకపోతే పిల్లల్నే, పుస్తకాల్నే పట్టుకుక్కూర్చుంటాను, 'ఇంకా నా ఒంట్లో ఓపికుండగా నీ కెందుకమ్మా?' అని వంట నాకు చెప్పరు. కదిలితే కందిపోతానేమోనని భయం మా అత్తయ్యకు" అంది కమల నవ్వుతూ.

# వ్యక్తిత్వం లేని వ్యక్తి

కామేశ్వరమ్మగారు నవ్వి ఊరుకుంది. ఇందిర ఆశ్చర్యపోయింది. ఎంత ముచ్చటైన సంసారం. అత్తా కోడళ్ళ అరమరికే లేదు. మేనగా ఉన్నాం వీధినపడకుండా. డబ్బుండగానే సరా! వీళ్ళలో ఉన్న ప్రేమాభిమానాల్లో నాల్గవ వంతైనా లేవు ఆ యింట్లో అనుకుంది.

"మీది మేనరికమా?" అనడిగింది కమలను.

"కాదు పై సంబంధమే."

"కట్నం?"

"ఏం లేదు."

"కట్నం ఇచ్చుకున్న నాకంటే, లేకుండా చేసుకున్న మీరే నయం. మూర్తిగారు, మీ



అత్తగారు చాల మంచివారు. అదృష్టవంతులు మీరు అంది."

"అహా అలాగనకండి. నాకంటె మీరే నయం. నేను వీళ్ళేం చెప్పినా నోరు మూసుకోవాలి. మీరలా కాదు. మీ మాటకెప్పుడైనా ఎదురు చెపితే మీ శ్రీవారిని కాలరు పట్టుకోండి. పారికవేలిచ్చి కొనుక్కున్నాను. పిచ్చి పిచ్చి వేషాలెయ్యొద్దనండి" అంది నవ్వుతూ. ఆ మాటలకు మిగిలిన వాళ్ళిద్దరూ కూడ నవ్వేసేరు. ఎప్పుడు క్రిందకు వచ్చారో మూర్తి, రమేష్ కూడ నవ్వుతుంటే సిగ్గుపడింది కమల.

'బాగానే చెపుతున్నారు' అన్నాడు రమేష్ నవ్వుతూ. అప్పుడే గంట అయిందండి మేము వచ్చి అంటూ వెళ్ళిపోయారు వాళ్ళు.

* * *

ఇంటికి వచ్చి భోజనానికి కూర్చున్న వారికి విస్తరి వేలా మొదలు పెట్టింది కామాక్షమ్మ. "రోజూ వెళ్ళుసుకునేది చాలదా? ఆ మూర్తిని ఇంటికెళ్ళి కూడ వెంటాడాలా? అయినా మూర్తి ఒక్కడేనేమిటి? ఇంకా ఎంతమందున్నారో? ఖర్మకాలి ఉద్యోగంలో ఉన్న దాన్ని చేసుకున్నాను. ఏ పల్లెటూరి పిల్లనేనా చేసుకుంటే బాగుండేది. అయినా ఇప్పుడనుకునేమిటి లాభం? శారదనిస్తామని మా తమ్ముడు వస్తే అక్కర్లేదని విసిరికొట్టేం." అంటూ దండకం చదివింది.

ఇంకా మాటలు వినలేక అన్నం వదిలి చెయ్యి కడిగేసుకుని వెళ్ళి పడుకున్నది. ఛీ అంత మంచిగా ఉండే మూర్తిగార్ని ఇలా అనడానికి ఈవిడకు నోరెలా వచ్చిందో? అన్నాచెల్లెళ్ళలా మాటాడుకుంటే కళంకం అంటగడుతున్నారు. అసలు మానవత్వం ఉందా? అనుకుంది.

ఈ మధ్య కోడలితోపాటు కొడుకును కూడ సాధించడం మొదలు పెట్టింది. ఎల్లాగయినా వాళ్ళను బాధపెట్టినా సరే దానిచేత ఉద్యోగం మానిపించాలి అన్న దృఢ సంకల్పంతో ఉంది. 'భార్యను అదుపులో పెట్టుకోలేని నాజమ్మ, అందరి భార్యలు భర్త మాట వింటుంటే వీడు భార్య మాట కెదురు చెప్పలేడు. చేతకాని వెధవ' అనేది.

ఒక వారం రోజులుగా రమేష్‌కి ఒంట్లో బాగుండటంలేదు. ఆ రోజు బ్యాంకుకు బయలుదేరుతున్న ఇందిరను పిలిచి 'నాలుగు రోజులు శలవుపెట్టు ఇందిరా. ఈ జ్వరం తగ్గేవరకు' అన్నాడు. 'అలాగే ఈ రోజు వెళ్ళి రేపట్నుంచి పెట్టేవస్తాను'అంది.

అది విని అత్తగారందుకుంది. "ఔను ఈవేళ ఎల్లా పెడుతుంది. అక్కడ వాళ్ళంతా ఎదురు చూడరు. ఈవేళ వెళ్ళి వాళ్ళకి చెప్పి రేపట్నుంచి పెడుతుందిట"అంది వ్యంగ్యంగా.

ఇందిరకు, ఇల్లొక నరకంలా తయారయింది. ఇక్కడున్నంత కాలము సుఖము, శాంతి వుండవు. వీళ్ళకి దూరంగా వుండాలి


రుచికరమైన, పుష్టికరమైన
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు
B
R
I
T
A
N
N
I
A
BRITANNIA
Glaxo
BISCUITS

అన్న నిశ్చయానికి వచ్చింది. అత్తగారి మాటలు, భర్త ముభావం, మామగారి నిరసన తోను ఆమెకు ఎక్కడలేని చికాకు వచ్చేది. ఒకరోజు తిని ఒకరోజు తినక ఆరోగ్యం పాడు చేసుకుంది. ఏడవని రోజు లేదు. చిక్కి శల్యమైన కూతుర్ని చూసి శ్రీనివాసరావు, అన్నపూర్ణమ్మ కుమిలిపోతున్నారు.

* * *

పెళ్ళయిన నాలుగేళ్ళకు తల్లి కాబోతున్న ఇందిరకు ఏ సంతోషము లేదు. ఈ నరకంలో ఇంకో ప్రాణి ఉదయిస్తోందన్న మాట అనుకుని విరక్తిగా నవ్వుకుంది. అప్పుడైనా పరిస్థితులు మారతాయేమో! ఆఫీసు నుండి ఇంటికివచ్చిన రమేష్‌కి పద్మ ఎదురయ్యింది.

'అక్కయ్యకూ శ్రీమంతం చక్కన్ని బావకు ఆనందం' అంటూ

'ఏమిటి పద్మా నీ వసేది?' అన్నాడు.

'ఏముంది బావగారూ ఇంట్లో విషయాలు ఏమైనా అసలు మీకు తెలుసా? అక్కా మీ కొక బాబుని ప్రజంట్ చెయ్యబోతూంది."

'ఔను తెలుసు.'

"ఊహూ పరవాలేదు. జడ పదార్థానికి కొంచెం చైతన్యం వచ్చినట్లుంది అమ్మ సూడిద, గాడిద అంటూ ఏదో తెచ్చింది. మీరు అక్కను పంపిస్తే తీసుకెడతాము. ఇంతకీ మీ అమ్మాయేపుట్టాలి అమ్మలాగే ఉండాలి ఏ దెబ్బలాడుకుంటున్నారా లేదా? కాని నేను మాత్రం భగవంతుడికి దండం పెట్టుకుంటున్నాను. బాబే పుట్టాలి మీలా అందంగా ఉండాలి కానీ మీ బుద్ధులు మాత్రం రాకూడదు"

'నాకంత చెడ్డబుద్ధులేమున్నాయి పద్మా?'

"వ్యసనాలే అక్కరేదు బావగారూ! ఒకళ్ళ మనస్సు నొప్పించేది ఏదైనా చెడ్డ బుద్ధే. అక్క గనుక ఓర్చుకుంటోంది. మీ అమ్మగారి మాటలకు, మీ ముభావానికి" అంది.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళిన రమేష్‌కి తల్లి గది లోంచి మాటలు వినిపిస్తున్నాయి. "ఎంత చెప్పినా వినిపించుకోదే ఆ ఉద్యోగం మానేయమని. అంత గతి కదుక్కుపోయిందా? దానికేం లోటు వచ్చింది. అక్కడెవరో ఉన్నారు. అందుకే అది వదల్లేకపోతూంది. నా మాట కేనాడైనా విలువిచ్చిందా ఈనాడు తగుదునమ్మా అని అడగడానికి. పుట్టింటి కెళ్ళినా సరే, నట్టేట్లో దిగినాసరే దానిష్టం" ఇలా సాగుతోంది.

ఆ తల్లీ కూతుళ్ళేమీ మాట్లాడలేదు. రమేష్‌ని చూసి 'బాబూ అమ్మాయిని పంపిస్తావా' అని అడగబోయింది. ఇందిర "అమ్మా ఇలారా" అంటూ తల్లిని పిలిచి "నే నిప్పుడిక్కడ నుండి కాలు కదిపితే మళ్ళీ ఈ గడపలోకి రానివ్వరు. చూశావుగా పరిస్థితి. ఆయన్నడుగుతే ఎంతో ఎదురుగా ఉన్న గోడ నడిగినా అంతే. మీ యిష్టం అంటారు. పురిటి సమయానికి నేను రావడమో, నీవే ఇక్కడకు రావడమో చెయ్యొచ్చు. నే నెక్కడుంటే ఏమిటి పై ఊరేమీ కాదు గా.

> **ఏది వెల్తురు? ఏది చీకటి?**
>
> పట్టపగలు పొడుచుకొచ్చే
> చిమ్మ చీకటి తెరలు
> కనుల వాకిట
>
> నీటి చుక్కలు
> కురిపిస్తే –
>
> అర్ధరాత్రి పలకరించే
> చల్లని సిరివెన్నెల
> కనుల వాకిట
>
> నీటి చుక్కలు
> కురిపిస్తే –
>
> అది విషాదం
> ఇది ఆనందం.
>
> — రామసూరి

అక్కడనుండి ఎవరో ఒకరు వస్తూనే ఉన్నారుగా" అంది. దానితో అన్నపూర్ణమ్మగారు బాధపడుతూ వెళ్ళిపోయింది.

హైదరాబాదునుండి శాంత వచ్చింది. ఇందిరను చూడాలని. ఆమె ఉన్న వారం రోజులు ఎంతో సరదాగా గడిచిపోయింది. శాంత పేరుకు తగినట్టుగానే శాంతంగా ప్రవహించే గంగానది లాంటిది. ఎవరిని నొప్పించలేదు. ఒకరు బాధపడుతుంటే చూడలేదు ఈ ఇంట్లో శాంత తప్ప పుట్టింది. తన భర్త మాట్లాడకపోయినా ఒక్క ఓదార్పు వాక్యమైనా చెప్పడు. ఏదీ పట్టనట్లుగా ఉంటాడు. శాంత వెళ్ళిపోతూ తల్లి ప్రవర్తనకు తను క్షమార్పణ చెప్పుకుంది వదినకు. ఎంతో హితబోధ చేసింది. "వదినా నీ కన్న నేను చిన్నదాన్నయినా యిల్లాలిగా సీనియారిటీ నాకుంది. అమ్మ మాటలకు నీవు మనసు పాడుచేసుకోకు. ఆవిడ ఎవరో ఒకర్ని ఏదో ఒకటి అంటూ ఉండాలి. నీవు మాత్రం ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. నీలాగే నెమ్మదైన, రూపవతియైన కోడల్ని నాకివ్వాలని మరీ మరీ చెప్పి బండెక్కింది."

'నా ఆరోగ్యంమీద నా భర్తకే లేని శ్రద్ధ నీకెందుకమ్మా' అనుకుని బాధపడింది.

కామాక్షమ్మ కోడలిని అపురూపంగా చూసుకొనేది బదులు శాపనార్థాలతో కడుపు నింపుతోంది "ముప్ఫయ్యేళ్ళొస్తున్నాయి. ఇంకా అపురూపమే. దీనికన్న రెండేళ్ళు చిన్నది మా శాంత. దానికప్పుడే ఎనిమిదేళ్ళ పిల్ల, ఐదేళ్ళ పిల్లాడు ఉన్నారు. ఈ రోజుల్లో మందులన్నీ పిచ్చిష్టమేగా. కావాలనుకుంటే పుడతారు. అక్కర్లేదనుకుంటే పుట్టరు." అనేది.

* * *

వారం పది రోజుల్లో పురుడు రావచ్చని చెప్పేరు డాక్టరుగారు. అన్నపూర్ణమ్మ వచ్చింది. కామాక్షమ్మ నెలలు నిండిన కోడలికి ఏమాత్రం సహాయం చెయ్యకపోవటం చూసి బాధపడింది. వియ్యపురాలిని చూసి వేరే వండుకోమని ఇంట్లో రెండు పోర్షన్లు చేసేసింది. వాళ్ళేమీ మాటాడలేదు ఆ ప్రకారమే చేసారు.

ఈమధ్య రమేష్‌కూడా బాగా మారిపోయాడు. ప్రతీదానికి విసుక్కోవడం, చిరాకు పడ్డం మొదలయింది. ఇందిర మెటర్నిటిలీవు పెట్టింది మూడు నెలలు ఇంట్లోనే ఉంది. ఒక్కసారి కూడ ఎలా ఉంది అని పలుకరించడు,

ఒకరోజు "కాఫీ చల్లారిపోయింది. మొద్దు స్వరూపాలు ఏమీ తెలియదు" అని కప్పు అలాగే టేబిలుమీద వదిలేసి వెళ్ళిపోయాడు. "నేనిచ్చి చాలా సేపయింది. నీవు పేపరు చూస్తున్నావు తాగుతావులే అని ఊరుకున్నాను." అని చెప్పబోయింది అన్నపూర్ణమ్మ. 'మీ సంజాయిషీ నేనడగలేదండి' అని విసిరికొట్టేడు.

మరోరోజు సాయంత్రం ...... ......

లేదు. "మీరంతా ఎకానమీ మనుష్యులని నాకు తెలుసు. కడుపుకి తినాలండి. తిండి దగ్గరకాదు ఎకానమీ అంతాను. సాయంత్రం ఇంటికొచ్చేసరికి ఏదైనా తయారుచేద్దాం అనికూడ లేదు." విసుక్కుంటూ హోటలుకు పుష్తద్దే రేడు. ఇదేంమనిషో చేస్తే మీ యిల్లు కాదని మీ ఇష్టంవచ్చినట్లు తగ లేస్తున్నారు అంటాడు. చెయ్యకపోతే ఈ పరస ఇని బాధపడింది ఆమె.

ఆ రోజున ప్రొద్దుట లేస్తూనే "అమ్మా విలాగో ఉంది. ఒకసారి హాస్పిటలుకు వెళి వద్దాము" అంది ఇందిర. "సరేనని బయల్దే రారు. ఆమెను చూసిన డాక్టరుగారు ఇక ఇంటికెళ్లకండి. కొన్ని గంటల్లో డెలివరీ అవ్వచ్చునని చెప్పారు. అలాగే 9-30ని.లకు కొడుకుతల్లి అయింది ఇందిర. ఎంత పని వాళ్లున్నా అవతల హాస్పిటల్‌లోను ఇవతల ఇంట్లోను చూసుకోవడం కష్టంగా వుండి పద్మను తెచ్చుకుంది అన్నపూర్ణమ్మ. ఇదే సమయమనుకుని పనిమనిషిని మానిపించే సింది కామాక్షమ్మ. అన్నపూర్ణమ్మగారు ఆసు పత్రినుండి రాగానే 'వదినగారూ పనిమనిషి మాతురుకు ఒంట్లో బాగుండలేదుట ఊరె ళ్లింది' అంది.

'పోన్లెండి అత్తయ్యగారూ మేం చేసుకో గలం ఈమాత్రం పని' అంది పద్మ. లోప లకు వచ్చిన తల్లితో "అమ్మా! ఈ మహా తల్లే మానేయమంది. పది రోజులు మానే యవే నీకు డబ్బిచ్చేస్తానులే అంటుంటే విన్నాను. ఆవిడ తోటలో పనిచేసే లక్ష్మిచేత తోమించుకుంటుందిట. బహుశా వాళ్ళెవరు చేసినా మనకు ఈవిడ చెయ్యనివ్వదేమో. ద్వారకానగరంనించి మన సూరమ్మను రమ్మం దాము" అంది. "సరేనంది" అన్నపూర్ణమ్మ.

పద్మనిచూస్తే కామాక్షమ్మకు ఎక్కడ లేని భయం. ఒక మాటంటే పది మాటలు చెప్తుంది. అది వెర్రిబాగుల్ది కనుక ఏమన్నా ఏడుస్తుంది. ఇదే అయితే తిరిగి నవ్వేడిపిస్తుంది. భగవంతుడు దాన్ని కోడలిగా చెయ్యడం కూడ ఒక మేలే అనుకుంది.

* * *

ఏమీ తోచక వీధిలో గుమ్మందగ్గర నిలు చున్న పద్మకు వంటావిడ సాయంత్రం వంట ముగించుకుని వెళ్లిపోతూ కనిపించింది. 'ఏమండి మాట' అని ఆమెను ఆపుచేసింది.

"నే నొకటి అడుగుతాను నిజం చెప్పండి.

మీకొచ్చే భయమేమీ లేదు. మీ యజమానురాలు లాంటివారు?'' అంది.

ఆవిడ అటూ యిటూ చూసి మెల్లగా ''మహా రాయ్యాళిగంప. ఆమె నోరు చూస్తే నాకు చాలా భయం. దేవతలాంటి మీ అక్కను నానా మాటలు అంటుంది. అమె ఏమీ మాట్లాడదు. కానీ నాకు మాత్రం కచ్చిళ్ళాగవు ఏమన్నా అన్నానంటే నాకున్న ఈ కాస్త నీడకూడ పోతుంది. చేతులారా పోగొట్టుకున్నదాన్నవుతానని ఊరుకుంటాను'' అంది.

ఈపని వాళ్ళకి అవకాశంవస్తే తెగ వాగుతారు అందుకని 'సరే మీరు నాకొక ఉపకారం చేసిపెట్టాలి' అంది.

'ఏమిటమ్మా నేను మీకేం చెయ్యగలను?'

'రేపట్నుంచి ఆవిడదగ్గరకు వెళ్లడం మానేయండి!'

''బాబోయ్ నేనింతవరకు ఒక్క రోజు కూడా మానలేదు. పదిహేనేళ్లనించి చేస్తున్నాను. ఒకవేళ ఎప్పుడైనా మానేసినా మా మనుమరాలిని పంపేదాన్ని. గుంటపిల్ల దాని చేత చేయించుకొనేదే. ఇప్పుడు మానేస్తే నాకున్న ఈ ఆధారం కూడ పోతుంది.'' అంది

# వ్యక్తిత్వం లేని వ్యక్తి

హడలిపోతూ.

''అలా కాదు మీరు కంగారుపడకండి. ఈ ఊళ్లోనే మాకు తెలుసున్నవాళ్ళున్నారు. వాళ్ళెప్పటినుండో అడుగుతున్నారు నమ్మకమైన ఒక వంటామెను చూడమని. కాబట్టి మీ రక్కడకు వెళ్ళవచ్చు. ఇంకా సందేహంగా ఉంటే రేపు నేనే తీసుకెళ్లి పరిచయం చేస్తాను మిమ్మల్ని'' అంది. ఆవిడ అంగీకారం తెలిసింది.

మర్నాడుదయం వంటావిడ పదయినా రాలేదు. రోజూ తెల్లవారగానే వచ్చే మనిషి ఎందుచేత రాలేదో. పోనీ పిల్లనయినా పంపలేదు అనుకుని మనిషిని పంపింది ఆవిడను తీసుకురమ్మని.

'ఆవిడ ఇంకేదో ఇళ్లొప్పుకుంది. ఇంక రాదుట' అంటూ వార్త మోసుకువచ్చాడు. అప్పుడందర్నీ తిట్టుకుంటూ వంటింట్లో కెళ్ళింది. పద్మ వచ్చింది ''అత్తయ్యగారూ, వంట మీరు చేస్తున్నారు ఆవిడ రాలేదా?' అడిగింది తెలియనట్లుగా ''రాలేదు. ఇంకేదో ఇల్లొప్పుకుందిట. ఇక్కడేం తెగులొచ్చిందో'' అంది. ''అయ్యో పాపం! ఎంత ఇబ్బంది వచ్చింది మీకు.'' అని పమిటకొంగు నోట్లో పెట్టుకుని నవ్వుకుంటూ వచ్చేసింది. కామాక్షమ్మకు ఒళ్ళు మండిపోయింది. ఇదే ఏదో చెప్పి ఉంటుంది రావద్దని. ఇందులో ఏదో మతలబుంది. వాళ్లకి పనిమనిషిని మానిపించేనని ఉక్రోషంతో చేసుంటుంది. దీని పని చెపుతా అనుకుని పళ్ళు నూరుకుంది.

'నాకు పనిచెయ్యనప్పుడు నువ్విక్కడెందుకే' అని పనిమనిషిని మానిపించేసింది. అది పద్మను పిలిచి 'అమ్మాయిగారు నేనిక్కడ పని చేయలేను. కోపగించుకోకండి అక్కడ మాత్రం మానిపించకండి. ఈ యమ్మగారెక్కడో యక్షిణీలాగుంది. మీ మొహం చూసైనా చెయ్యాలనుకున్నాను. కానీ ఈవిడచేత నానా మాటలు నేను పడలేనమ్మా' అంటూ వెళ్లిపోయింది.

మర్నాడు అనుపర్తికి వెళ్ళిన అన్నపూర్ణమ్మగారు ఈ పది రోజుల్లోను జరిగిందంతా కూతురితో చెప్పింది. ''ఏమ్మా! గతిలేక వచ్చామనుకుందా మీ అత్తగారు? అసలు ఇంత గొడవ జరుగుతున్నా మీ ఆయన కలుగచేసుకోకపోవడం చాలా ఆశ్చర్యంగా ఉంది. పురుడంటే మాటలా? హాయిగా మనింటి దగ్గరే ఉందువుగాని అంటే నీవు రానన్నావు'' అంది బాధగా.

'మీ అల్లుడు వచ్చాక నేను మాట్లాడతానులే అమ్మా' అని తల్లిని సమాధాన పరచింది ఇందిర.

* * *

ఇందిరను, బాబును చూడటానికి వచ్చారు కామేశ్వరమ్మగారు, కమల, అనుపర్తి నుండి ఇంటికెళ్లిపోతూ దారిలోనే కదా అని కామాక్షమ్మదగ్గరకు వచ్చారు. ఆమె అన్నీ బాగానే మాట్లాడింది. కామేశ్వరమ్మగారు పద్మనెప్పుడూ చూడలేదు.

'ఎవరూ బంధువులా' అనడిగింది.

''ఆ దొమ్మర మేళం తయారయింది. కంది కావాళక్క. చేసుకోవటానికి వచ్చారు తల్లీ కూతురు.'' అది కసినంత చూపిస్తూ. గదిలోంచి వచ్చి తిరిగి సమాధానం చెప్పాలనుకుంది పద్మ. ఎవరో కొత్తవాళ్ళున్నారు బాగుండదని ఊరుకుంది.

కామేశ్వరమ్మగారు ఆశ్చర్యపోయింది. తను చెయ్యదు. వాళ్ళు చేసుకుంటే ఊరుకోదు. ఈ ప్రవర్తనేమిటి అనుకుంది. 'ఇంక వస్తా

# యువతరం

ఉన్నతాశయాలు, ఉత్తమాభిరుచులు ఉన్న ఈ యువకుని పేరు ఎస్. వెంకటరావు. జన్మస్థలం కాకినాడ. ప్రస్తుతం హైదరాబాద్‌లో వు. టూ, ఎల్. ఎల్. బి. పరీక్షకు సాయం కళాశాలలో చదువుతున్నాడు. బి. కాం. పట్టభద్రుడు. ఉదయం ఏవేవో పనులు పూనికతో చేస్తాడు ఇంగ్లీషు తెలుగు టైపులో సిద్ధహస్తుడు. హిందీ టైపు కూడా నేర్చుకుంటున్నాడు.



పట్టుదల, కృషి వుంటే, జీవితంలో ఎంతటికార్యాన్నైనా సాధించవచ్చునన్న విశ్వాసంతో ముందుకు పోతున్నాడు. ఉద్యోగరీత్యా ఎప్పటికైనా విదేశాలకువెళ్ళి, తన ప్రతిభను పెంపొందించుకోవాలని ఉవ్విళ్ళూరుతుంటాడు.

విదేశీ పత్రికలన్నా, సుభాషితాలు, జోకాభిరామాయణాలన్నా చాల సరదా. పత్రికల క్లిప్పింగ్స్ పోగుచేయడం, తనకు నచ్చిన సినిమాల నదే పదే చూడడం ఇతని హాబీ. తెలుగు సినీనటులందరినీ ప్రత్యక్షంగా చూచానంటాడు సాహిత్యమన్నా అభిరుచి ఎక్కువే. 'నవోదయం' అనే సాహిత్య సాంస్కృతిక సంస్థలో కార్యవర్గ సభ్యుడు అడపా దడపా రేడియోలో యువవాణి ద్వారా ఆంధ్రావళికి తన గొంతు వినిపిస్తుంటాడు.

బ్యాడ్మింటన్ ఆడటం బాగా తెలుసు. క్రికెట్ మ్యాచ్‌లకు వెళ్లుతూ వుంటానంటాడు.

బంధువులకన్నా మిత్రులే ఆప్తులని విశ్వసించేవాడు గనుక, మిత్రుల బలగం ఈయనకు తామర తంపర.

మనసుకునచ్చి, తనను అర్థం చేసుకొనే జీవిత భాగస్వామిని లభిస్తే కట్నం అన్న ఊసే లేకుండా వివాహమాడాలని ఉద్దేశం.

[* * *]

# నాకు తెలుసుగా గ్లైకోడిన్ నమ్మకమైనదని-

## ఆమె దగ్గుకు ఇట్టే ఉపశమనాన్ని కలిగిస్తుందని...






**భారతదేశంలో దగ్గులను నివారించే యితర మందులకన్న, గ్లైకోడిన్ ఎందరికో దగ్గునుండి ఉపశమనాన్ని కలిగించింది.**

**అందుకే ఇది ప్రథమశ్రేణికి చెందినది.**

ఇది దగ్గు బాధించే అన్ని భాగాలలోనూ త్వరగా పనిచేసి త్వరితమైన, ఖచ్చితమైన ఉపశమనాన్ని యిస్తుంది.

- గొంతు మంటను తగ్గిస్తుంది.
- కఫమును తొలగించి జలుబు వల్ల వచ్చే దగ్గుల నుండి ఉపశమనాన్ని యిస్తుంది.
- సుఖ నిద్రను కలిగించి, ఛాతీలో కండరాల బిగువును తగ్గించి, సులభంగా శ్వాస పీల్చేందుకు తోడ్పడుతుంది.

దగ్గు ఎలాంటిదైనాసరే—పూర్తిగా అదుపులోకి తెచ్చేందుకు మంచి రుచికరమైన గ్లైకోడిన్‌పై మీరు ఆధారపడవచ్చు.




గ్లైకోడిన్—దగ్గులను కొట్టిపడవేయు భారతదేశపు ఛాంపియన్—
విశ్వసనీయమైన మందులను తయారుచేసే అలెంబిక్ సంస్థ ఉత్పాదన.

everest/519/ACW-II

# వ్యక్తిత్వం లేని వ్యక్తి

మండి' అని లేచి వెళ్ళిపోయారు.

ఇందిర రమేష్ ఆసుపత్రికి రాగానే ప్రారంభించింది ఇంట్లో పరిస్థితంతా "పచ్చి బాలెంతరాలివి ఇప్పుడు నాతో దెబ్బలాడతావా? అలసట పనికిరాదు పడుకో" అంటూ నవ్వుతూ వారించేడు.

"నవ్వులాట కాదు ఒక్కసారి అర్థం చేసుకోండి. వాళ్ళ గతి కదుక్కుపోయి రాలేదు మీ యింటికి. మీ అంత ఆస్తిపరులు కాకపోయినా నిరుపేదలు కాదు ఇంట్లో ఉన్న వాళ్ళని అంత చీదరించుకోవటం మర్యాద కాదు. మీ అమ్మా నాన్నా అ వరస. మీరు చూస్తే అసలు మాటే మాట్లాడరు. ప్రతిదానికి విసుగు. ఏం చెయ్యమంటావో చెప్పండి" అని నిలదీసింది.

"నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి నేనేం చెప్పలేను" అని వెళ్ళిపోయాడు. శిలాప్రతిమలా అయిపోయింది ఇందిర.

"అమ్మా రేపు డిశ్చార్జి అయి తిన్నగా మనింటికి వెళ్ళిపోదాము. ఇంట్లో నా బట్టలన్నీ తీసెయ్యి" అంది తల్లితో. తెల్లబోయిందావిడ.

"కానమ్మా నేనా యింట్లో ఉండలేను. ఇప్పటికే నా ఆరోగ్యం చాలా పాడైపోయింది. ఇంకా అక్కడే ఉంటే నీ కూతురు నీకు దక్కదు." అనగానే ఆమె నోరు మూసుకుంది. ఎటువంటి తల్లయినా మాట్లాడలేదు. నీవా నరకంలోనే ఉండు అని శాసించలేదు. తనకి తెలియని విషయాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆమె దాస్తోందని, చెప్పలేక బాధ ననుభవించలేక మూగ వేదన పడుతోందని అన్నపూర్ణమ్మ గ్రహించింది.

(ఇంకా ఉంది)

## వివిధభారతి ఆదాయం

ఆకాశవాణి వాణిజ్య ప్రసార (ప్రచార) విభాగాలు 1975-76 సంవత్సరంలో చాలా ఎక్కువ పైకం ఆర్జించింది. 6 కోట్ల రూపాయలు యీ ఏడాది వివిధభారతి కార్యక్రమాల మధ్య వినిపించే ప్రకటనల ద్వారా రేడియోవారికి ఆదాయం వచ్చింది పోయిన యేడాదికన్నా యిది 40 లక్షల రూపాయలు ఎక్కువ. 1957 లో యీ వాణిజ్య ప్రకటనలు ప్రారంభించారు. అయితే యివి యింకా అన్ని ప్రాంతాలకు చేరటంలేదు. దేశంలో గల ఆకాశవాణి 76 కేంద్రాలు 80 శాతంకన్నా ఎక్కువ జనాభాకి వినిపిస్తాయి.

## అవీ - ఇవీ - అన్నీ

### ఏ హాండ్ బుక్ ఆన్ బోగన్ విల్లా కల్చర్

ఏ హ్యాండ్‌బుక్ ఆన్ బోగన్‌విల్లా కల్చర్— నిజానికి బోగన్‌విల్లా లతల పెంపకం మీద ఒక 'సర్వస్వం' లాగుంది. దీని రచయిత శ్రీ బి. పి. రామారావుగారిని 'బోగన్‌విల్లా ఒడయార్'' అని ప్రేమగా అంటారని పరిచయం వ్రాసిన శ్రీ ఆర్. కిప్పిన్‌పీటర్‌సన్ పేర్కొన్నారు. ముప్పై ఐదు సంవత్సరాలకన్నా ఎక్కువ కాలం పూలతోటలు' క్రోటన్సు మొక్కలు పెంపకంలో అనుభవంగల నిపుణుడు వ్రాసిన యీ బోగన్‌విల్లా గ్రంథం ''గార్డెనింగ్'' హాబీ గల 'వాళ్లందరికీ అపురూపమైన కానుకలాంటిది.

''బోగన్‌విల్లా'' అంటూ యిప్పుడు మనందరు తోటల్లోను, పార్కులలోను, ఇళ్లల్లో కూడ ఎన్నోరకాలను పెంచుకొంటూవుంటారు. దీన్ని మొట్టమొదట 'బ్రెజిల్' దేశంనుంచి 'కామ్మెర్సన్' అనే ఫ్రెంచి వృక్షశాస్త్రవేత్త పట్టుకుపోయి తనతోపాటు 18 వ శతాబ్దంలో ప్రపంచ పర్యటన చేసిన ఫ్రెంచి మహా నావికుడు శ్రీ లూయీ ఆంటోనీ డిబోగియన్ విల్ పేర ప్రచారం లోనికి తీసుకుని వచ్చారుట. ఈ 'లత'ని మన వాళ్లు ''బోగన్‌విల్లా'' అనే వ్యవహరిస్తూంటారు. బొమ్మలతో సహా బోగన్‌విల్లా గురించి ఎన్నో విశేషాలు శాస్త్రీయ సంగతులు వున్న యీ యింగ్లీషు పుస్తకం వెల రు. 12 ప్రతులకు బి. పి. రామారావు, లలితానిలయం 53— ఏ— క్రెసెంట్ అవెన్యూ, కె. పి. పురం మద్రాసు— 600023కి వ్రాయాలి.

### మదరాసులో తెలుగు పఠన మందిరం వార్షికోత్సవం

మదరాసు పల్లిపాకంలోని తెలుగు పఠన మందిరం 14వ వార్షికోత్సవం అక్టోబరు 10న జరిగింది. కార్యదర్శి శ్రీ ఉమామహేశ్వరరావు స్వాగతం పలికారు. అధ్యక్షులు డా. మోహన్‌రెడ్డి ముఖ్య అతిథులను పుష్పమాలాలంకృతుల్ని చేశారు. కథాసాగర్ అధ్యక్షులు డా. ముద్దుకృష్ణారెడ్డి సభకు అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అందించిన రు. 5 వేల సహాయానికి కార్యదర్శి కృతజ్ఞతలు తెలిపారు. చలనచిత్రనిర్మాత శ్రీ ఎం. ఎస్. రెడ్డి, ఆచార్య ఆత్రేయ, నటి జమునా రమణారావు, తమిళనాడు ప్రభుత్వ వ్యవసాయశాఖ ఉపకార్యదర్శి శ్రీ జి. భుజంగరావుగార్లు ప్రసంగించారు. ఆటల పోటీల్లో విజేతలకు నటి జమున బహుమతిప్రదానం చేశారు. శ్రీ జె. వి. చలపతిరావు వందనసమర్పణ చేశారు. సభానంతరం 'కోడెనాగు' చిత్రాన్ని ప్రదర్శించారు. (ఒ.వి)

# ధర్మపథం

## జ్ఞానము - అజ్ఞానము

జ్ఞానమనగా ఏట్టిది? అజ్ఞానమనగా ఎట్టిది?- అనే ప్రశ్న వచ్చినప్పుడు శ్రీరామకృష్ణపరమహంస ఈ విధంగా తెలియజేశారు–

'నేను,నాది' అనే భావం ఉండడం అజ్ఞానం.'నీవు–నీది' అనే భావం కలగడం జ్ఞానం.అలాగే నాకు పాండిత్యం ఉన్నది -అని గర్వించడం . అజ్ఞానం. సర్వభూతముల యందున పరమాత్మ ఉన్నాడన్న స్థిరబుద్ధి జ్ఞానం. పరమాత్మను గురించి విశేషంగా తెలుసుకోవడమే జ్ఞానాజ్ఞానాలకు అతీతమైన విజ్ఞానం.

భగవంతుణ్ని తెలుసుకొనుటకు ఈ రెండింటినీ అతిక్రమించవలసి ఉన్నది అజ్ఞానాన్ని నశింపజేసుకొనుటకు మాత్రమే జ్ఞానం ఉపయోగిస్తుంది దాని ప్రయోజనం అంతే! కాలిలో ముల్లు విరిగినప్పుడు ఆ ముల్లు తీసి వెయ్యడానికి సూదిని ఉపయోగిస్తున్నాము. ముల్లును తీసివేశాక మరి సూది అవసరం లేదు. ఆ సూదిని పట్టుకుని యెవ్వరూ కూర్చోరు.ఆ రీతిగా అజ్ఞానంతోపాటు జ్ఞానం కూడా తొలగిన తర్వాతనే విజ్ఞాన స్వరూపమైన పరమాత్మానుభవం కలుగుతుంది.విశ్వమంతా పరమాత్మతో వ్యాపృతమై ఉన్నదని చెప్పినంతమాత్రాన ప్రయోజనం లేదు.పరమాత్మానుభూతి కలగాలి.

మహాజ్ఞాని అయిన వశిష్ఠమహర్షి పుత్రశోకంవల్ల అతి దీనంగా విలపిస్తూ ఉండగా చూచి లక్ష్మణుడు మిక్కిలి ఆశ్చర్యపడ్డాడట! "మహాజ్ఞాని అయిన ఆ మహాముని అలా దుఃఖించడానికి కారణమేమిటి?"అని అతడు రాముణ్ణి ప్రశించాడట!రాముడు చెప్పిన సమాధానం యిది–

"తమ్ముడా!జ్ఞానం ఏక్కడ ఉంటుందో, అజ్ఞానం కూడా అక్కడ ఉంటుంది.వెలుగు ఉన్నదని తోస్తే దాని వెనుక చీకటికూడా ఉన్నదని తెలుస్తూ ఉంటుంది. వసిష్ఠులవారు గొప్ప జ్ఞాని అయినా, మాయకు అతీతులు కారు. అందువల్లనే పుత్ర శోకానికి గురి అయ్యారు. పరబ్రహ్మం జ్ఞానాజ్ఞానాలకు అతీతుడు. ఒక్క తెలివి వుంటే అనేకవిధాల జ్ఞానాలు కలుగుతాయి. అజ్ఞానంతోపాటు జ్ఞానాన్నీ విడిచిపెట్టిన తర్వాతగాని తత్వ్వగతి కలగదు. బహ్మం సుఖదుఃఖాలకూ, పాప పుణ్యాలకూ, ధర్మాధర్మాలకూ, మంచి చెడ్డలకూ అతీతుడు. ఆ పరమాత్మానుభవం ఇంకా కలుగనందుననే ఆయన పుత్రశోకంవల్ల విలపించవలసి వచ్చినది."

అయితే-జ్ఞానాజ్ఞానాలకు అతీతమైన పరమాత్మస్వరూపం ఎట్టిది? అని ప్రశ్నిస్తే, సమాధానం చెప్పడం కష్టం. అది అనుభవైక వేద్యమే కాని"ఇట్టిదీ అని వివరించి చెప్పడం సాధ్యం కాదు "

–బులుసు వేంకట రమణయ్య



మీరుగూడా ఇంత ఆకర్షణీయంగా కనబడాలంటే, ఈ గుర్తు జ్ఞాపకముంచుకోండి!
ఇది పోదార్ టెక్స్‌టైల్స్ వారి గుర్తు!









**PODAR textiles**

సూటింగ్స్ ★ షర్టింగ్స్
మరియు చీరెలు

RADEUS-PT-1R

## ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

### ముఖచిత్రంలో కొత్తదనం

22.10.1976 పత్రిక వాణిశ్రీ క్లోజప్ ముఖచిత్రం చూస్తూంటే పదునారు కళల పరువాల సిరులపసిడి బొమ్మ వాణిశ్రీయే అనిపిస్తూ ముద్దొస్తూ ఉన్నదీ నా కళ్లకు. ఇంత అందమైన ముఖచిత్రం ఏ పత్రిక యందునూ చూడలేదు.

ఈ వారం కథలు మూడింటిలో 'నేను రచయితను కాను' కథ సహజంగా సజీవంగా ఉన్నది. 'ఆకలి జబ్బు'లో కథానాయిక పాత్ర ఉత్తమంగా ఉంది. ఎక్కడికీ పయనం, కకుభగారి 'భ్రమ' కూడ బాగున్నవి. సీరియల్స్‌లో ఈ వారం 'పంజరి' బాగుంది.

ము. ము, ముప్పేట చేదా అంటూ సావాసాన్ని సజావుగుడు ముచ్చటగా ఉంది. ధర్మపథలో ఇష్టానిష్టాలు నన్ను బాగా ఆకట్టుకుంది. వార్తలు లేటెస్ట్‌ని తెలుపుతున్నందుకు అభినందనలు. వసూళ్ల చక్రవర్తి రామారావే ఆ తరువాతే శోభన్. వాణిశ్రీ ముఖ చిత్రం ప్రచురించటంతో ఈ వారం నుండి పత్రికకు అందం రెండింతలు ఎక్కువయింది.

సి. వెంకటరంగారెడ్డి (హైదరాబాదు)




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు.




చమట వలన గలిగే శరీర దుర్గంధాన్నుండి శక్తివంతంగా కాపాడుతోంది.

ఏ సబ్బు పూర్తిగా వుంచనంత తాజాగా మిమ్ములను వుంచుతుంది.

సౌందర్య రక్షణకై చర్మ రోగ నిపుణులచే సిఫారసు చేయబడింది.

ప్రత్యేక సదుపాయం!

**సింథాల్ పై 30 పై. తగ్గింపు**

స్టాకు వున్నంతవరకే పరిమితం గాన త్వరపడండి.

# మీరు షర్మిలా టాగూర్‌ని, పర్‌వీన్ బాబీని మా చీరల్లో చూశారు. ఇప్పుడు మిమ్మల్ని చూడనివ్వండి.

## బోంబే డైయింగ్ మోడల్ పోటీలో న్యూయార్క్ ప్రయాణాన్ని గెలుచుకోండి

మీరు ఈ సంవత్సరపు బోంబే డైయింగ్ మోడల్‌గా ఎన్నిక అయితే, న్యూ యార్క్‌కి రానూ పోనూ ఉచిత టికెట్ యిస్తాం.

ఎలాగంటే :

బోంబే డైయింగ్ అధికృత రీటెయిల్ స్టోర్‌కి వెళ్ళండి. కొత్త డిజైన్లలో దేనినైనా ఎంచుకోండి. ఒక పోలియెస్టర్ చీరగాని, రెండు కాటన్ చీరలు గాని. మీ ఒంటిపై అద్భుతం అనిపించే రంగుని. ఎంచుకోండి. ఆ చీర కట్టుకుని మీరు తీసుకొన్న ఫొటోలను మాకు పంపించండి.

ఎవరు చెప్పగలరు, మీరు కొన్ని నెలల్లో గొప్పవారు కావచ్చు జాక్ పాట్ కూడా కొట్టొచ్చు. వివరాలకై మీ బోంబే డైయింగ్ అధికృత రీటెయిల్ స్టాకిస్టుని సంప్రదించండి.

# బోంబే డైయింగ్

